

బజరంగ్‌దళ్ - (పూ.ఆంధ్ర)



బజరంగ్‌దళ్ - శిక్షణశిబిరం - (ప.ఆంధ్ర)



# 'విశ్వహిందు'

సంపుటి : 11 సంచిక : 8 ఈశ్వర - శ్రావణం ఆగష్టు- 1997

ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**పింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా - రూ. 50.00

విడిప్రతి - రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.

చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ - 500 095.

ఫోన్: 4617799, 591322.

ఈ సంచికలో ...................... పుట


సంపాదకీయం ............................ 2

స్వాతంత్ర్యము ............................ 4

శ్రీకృష్ణుడు ............................ 5

తూర్పు దిక్కులో ఎత్తుపల్లాలు ............ 6

పరిప్రశ్న ............................ 7

భారతీయ ముస్లింలను దూరంగా వుంచాడు
కెమాల్ పాషా ............................ 8

అశ్లీలతపై అతివల విజయభేరి ............ 9

తరిగొండ వెంకమ్మ ......................10

ఆదినుండి ఆధునికం వరకు - స్త్రీ ........13

సంస్కృతి జయంతి - గోహత్య పాపం ...... 15

లేఖ ............................ 16

హైందవ పుణ్యక్షేత్రాలు .................. 18

సంకట మోచన్‌ధామ్ .................... 19

విదేశీ ఉత్పత్తులు బహిష్కరించండి ......... 27

జగన్నాటకం ............................ 22

ఆంధ్రకేసరి ......... ...................... 23

గాయత్రీ మంత్రము ..................... 24

వార 25

బంజార చరిత్ర ......................... 26

బసవయ్య సేవకు ........................ 27

ప్రాచీన చారిత్రక ప్రాంతాలు ................ 28

దేవుళ్ళెందరు ..........................29

ఆదిత్య హృదయం ......................30

మతం మారుతావా - మానవసేవ పేరుతో ..31

శ్రీ రుద్రమ్ ............................ 32


ముఖచిత్రం : స్వాతంత్ర్య పతాకం

సంపాదకీయం

# స్వర్ణోత్సవాలు

''దేశమంటే మనుషులోయ్
దేశమంటే మట్టికాదోయ్'' అన్నాడు గురజాడ.

అయినా దేశమంటే మట్టే - మట్టిలో నుండే అన్నం, మనిషి - మట్టిలోకే చివరకు మనిషి. మట్టి లేంది మనిషిలేడు - సృష్టిలో పంచభూతాల్లో మట్టిప్రధానం - ఆధారం. కనుక మట్టి = మనిషి = మట్టి.

ఆ మట్టినే భారతీయులు 'సకలసంపత్ సమేత' భరతమాత అంటూ కన్నతల్లితో సమంగా, కాదు కాదు, మిన్నగా గౌరవించి ఆరాధించారు - మనీషులైనారు.

భారతిని మట్టిగానే భావించిన స్వార్థపరులు ఆ మట్టిని పరాయిపాలకుల పరం చేశారుకొన్నేండ్లు.

సీతారామరాజు, శివాజి, ఆజాద్, ఝాన్సీలక్ష్మి,వీరసావర్కార్, లాల్, బాల్, పాల్, కరంచంద్ గాంధి, నేతాజీ, ఆంధ్రకేసరి లాంటి త్యాగధనులనేకుల కృషి, త్యాగ ఫలితంగా అఖండ భారతి రెండు, మూడుముక్కలై స్వతంత్రమైంది. 50 సంవత్సరాల స్వతంత్ర భారతికి స్వర్ణోత్సవాలు జరుపుకుంటు న్నాము.

స్వర్ణం అతివిలువైనదే కాని వాసన రహితం. అయితే మన ఏభై సంవత్సరాల స్వతంత్ర స్వర్ణ భారతి విలువ స్వార్థరాజకీయ పాలకుల, నాయకులపాలై ఒకేదేశం, ఒకేప్రజ, ఒకేజాతి, ఒకేన్యాయం, ఒకేధర్మం, ఏ కాత్మత, ఐక్యతలు సమాధికాబడి పురోభివృద్ధి వత్తవడక్కై, మత ఘర్షణలు, కుల కక్షలుతో అనేక కుంభకోణాలతో చీలికలు పేలికలై దుర్గంధ భూయిష్టమైంది.

పేదలు మరి మరీ నిరుపేదలుగా, ధనికులు మరిమరీ మహాధనికులుగా, మధ్యతరగతి వారు అడకత్తెరలో పోకచెక్కలుగా మిగిలిపోతున్నారు.

స్వదేశీ, స్వయం ఉత్పత్తి, సురక్ష విధానాలు సన్నగిల్లి 'కంచే చేను మేస్తున్న'తీరులో ఆర్థిక పరిస్థితి దిగజారి దేశం అప్పుల పాలైంది. తిరిగి విదేశీ పెత్తనానికి దారితీస్తుందన్న అనుమానాలకు తావు ఏర్పడుతోంది.

ఇట్టి విషమస్థితిలో భారతస్వతంత్ర స్వర్ణోత్సవాలు రావడం జరగడం, మించి దేశ సర్వాధిపతిగా తొలిదళిత రాష్ట్రపతిగా గౌ॥ శ్రీ K.R. నారాయణన్ ఎన్నుకోబడడం ముదావహం - సువర్ణాక్షరలిఖితం.

తొలిదళిత రాష్ట్రపతి హయాంలో ఒకేదేశం, ఒకేజాతిగా భారతి స్వర్ణమయం కావాలని, ఆదిశగా గౌ॥ శ్రీ నారాయణన్ మార్గదర్శనం చేస్తారని ప్రజలు ఆశిస్తూ హర్షిస్తున్నారు.

'జైహింద్'

స్వర్ణ ఉత్సవాలు జరుపుటే సరిపోదు
పేదప్రజల పాలి పెన్నిధియగు
పథకములొనగూర్చు ప్రభుత లవసరంబు
విశ్వహిందువాణి వినుడు వినుడు.

- సుందరం.

## వందేమాతరం

- ఈశ్వర రెడ్డి

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ భారతికి వందనం
హిమగిరి వింధ్యా హిందూ సింధూ
- భారత వందే మాతరం
గానం వందేమాతరం - మా ప్రాణం వందేమాతరం
వందేమాతరం వందేమాతరం వందేమాతరం వందేమాతరం
బంకిం భావలహరుల ఊపిరి
- ఊజ్వల వందేమాతరం
భారత జనతను జాగృతి చేసిన
- శక్తి వందేమాతరం
జాతీయ వీరుల విప్లవ మంత్రం
- దివ్య వందే మాతరం ॥ గానం ॥
చిరునవ్వుల ఉరికంబమెక్కిన
- త్యాగం వందేమాతరం
ఎందరో విప్లవ వీరుల రుధిరం
- తర్పణ వందేమాతరం
వేదాక్షర ధ్వనుల దివ్య కంపనం
- ప్రేరణ వందేమాతరం ॥ గానం ॥
మాతృమూర్తి ఆరాధన గీతం
- స్ఫూర్తి వందేమాతరం
మనసూ మాటా భాషావేషం
- సర్వం వందేమాతరం
కోటి కోటి కంఠాల నినాదం
- నాద వందేమాతరం ॥గానం ॥

# స్వాతంత్ర్యము

శ్రీకృష్ణానంద మఠం, హైదరాబాద్.

భారతదేశం స్వాతంత్ర్యమును సంపాదించి అర్ధశతాబ్దం పూర్తయింది. మరి, స్వాతంత్ర్యం మాటవరుసకా, భావయుక్తమా అని విచారించాలి. తంత్రమునకు సంబంధించినది అనే అర్థంగలది తంత్ర్యము అన్న పదం. తంత్రం అంటె, ప్రస్తుత సందర్భంగ ఉపాయము, సిద్ధాంతము అని అర్థం. ముందు 'స్వ' అనే పదం చేరి, ఇది స్వతంత్ర్యం అయింది. ఇప్పుడు, తన యొక్క తంత్రం అని అర్థం పలుకుతుంది. తానెవరో విచారణచేసి తెలుసుకుంటె విషయమంత వివేకపరంగ విదితమవుతుంది.

తాను దేహం అనుకోవటం దేహదృష్టి = భౌతికదృష్టి. తాను మనస్సు = జీవుడు అనుకోవటం సూక్ష్మమే అయినా మాయాదృష్టి. ఇవి రెండూ సత్యములు కావు, వ్యావహారికములు. సృష్టిలో వ్యావహారికసత్తాదృష్టి లేదు. సృష్టింపబడ లేదు. లేనిదానిని కాపాడాలన్న ప్రయత్నం మాయయే. తనకు ఇటు వంటి మాయారూపాలు కల్పించుకుని, అక్కడ ఉపాయాలూ సిద్ధాంతాలూ కల్పించుకుని, ఈ విధంగ స్వంతంత్రం కావాలనుకుంటె, ఇది మాటవరుసకు, భావయుక్తం కానేరదు. ఎందుకంటే, ఇటువంటి ఉపాయాలకూ సిద్ధాంతాలకూ ఇదమిత్థమనే స్వరూపాలు లేనందున వైవిధ్యం పెరిగి ప్రశాంతతకు భంగం కలుగుతుంది.

తాను దేహ-జీవభావాలకు అతీతమైన ఆత్మస్వరూపుడనని గుర్తించినపుడు, తన ఉపాయం ... సిద్ధాంతం ధార్మికం అవుతుంది. పారమార్థికమవుతుంది, సృష్టికి సమ్మత మవుతుంది, సృష్టి సహకరించగలిగినది అవుతుంది.

''దేశమంటె మట్టికాదోయ్, దేశమంటె మనుష్యులోయ్'' – ''మనుష్యు లంటె తోలుబొమ్మలు కాదోయ్, మనుష్యులంటె చైతన్యరూపాలోయ్'' – ''చైతన్య మంటె చంచలపు పరుగుళ్ళు కాదోయ్, చైతన్యమంటె నిశ్చలత్వమును గ్రహించుటోయ్''.

దేశప్రజలు నిలిపినదే దేశస్వాతంత్ర్యం, ఇది శాశ్వతస్వాతంత్ర్యం. ఏదో ఒక సందర్భంలో, ఎవరో కొందరు దేశోద్ధారకులు సమరంలో సాధించినది స్వాతంత్ర్యం కాలేదు, ఇది దేశమున్న మట్టికే స్వాతంత్ర్యం. మనుష్యులు స్వాతంత్ర్యాన్ని నిజరూపంలో స్వాధీనంచేసుకొని నిలుపుకోకుంటె, కాలాన, మట్టితోపాటు మనుష్యులనుకూడా ఎవరో స్వాధీనం చేసుకుంటారు. అప్పుడు, దైహిక, మానసిక- ఆధ్యాత్మిక స్వాతంత్ర్యములన్నీ సతమతమవుతయ్, స్వాతంత్ర్యమన్న పదానికే అర్థం అనర్థమవుతుంది.

వ్యవహారంలో వ్యావహారిక జీవితం గడిపినప్పటికీ పారమార్థిక ప్రమాణమును విలువలను ప్రభుత్వము....ప్రజలు ( ఉభయులు) గుర్తించాలి. తినుటకొఱకు బ్రతుకుట, బ్రతుకుటకొఱకు తినుట అన్న రెండు సిద్ధాంతాలలో ప్రభుత్వపాలనకూ ప్రజలజీవితానికీ (రెండింటికీ) విపరీతమైన వ్యత్యాసం కలిగిన ఉపాయాలుంటయ్. అట్లే, పారమార్థిక విలువలు ప్రమాణంగ పరమార్థమునూ వ్యవహారమునూ గ్రహించుట, వ్యావహారిక విలువలు ప్రమాణంగ పరమార్థమునూ వ్యవహారమునూ గ్రహించుట, అన్న రెండు సిద్ధాంతాలలో ప్రభుత్వపాలనకూ ప్రజలజీవనానికీ విపరీతమైన వ్యత్యాసం కలిగిన ఉపాయాలుంటయ్. సిద్ధాంతభేదం లేనప్పుడు ఉపాయభేదం ఉండదు, అప్పుడు 'స్వ' భేదం

ఉండదు. పారమార్థిక విలువలు ప్రమాణంగ ప్రభుత్వమూ ప్రజలు కూడా ప్రవర్తించిననాడు దేశంలోనూ...... ప్రజలలోనూ భేదబుద్ధి నశించి నిజస్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. దేశంలో ప్రస్తుతపరిస్థితి ఈ కావలసిన విధంగ లేదు. వ్యావహారిక విలువలు ప్రమాణంగ, అంటే దేహ సుఖం మనస్సు యొక్క సుఖం ప్రమాణంగ భేదబుద్ధిని తీసివేసి శాంతిని సాధించాలిన ప్రభుత్వమూ ప్రజలుకూడా ప్రయత్నిస్తున్నారు. అంటె. భేదములు పెంచుకుంటూ భేదబుద్ధిని తీసివేయాలనుకుంటున్నారు. ఇది వృధాప్రయత్నమేగాక ధర్మహానికి దారి అవుతుంది, శాంతి హీనమైన స్వాతంత్ర్యమే ఫలం.

ఈ అవాంతరానికి నిజకారణం గుర్తించక ప్రజలూ ప్రభుత్వమూ ఒకరిపై ఇంకొకరు నేరారోపణలు చేసుకుంటూ వ్యవహారం సాగిస్తే విషయం విషమయమవుతుంది, సారంలేని స్వాతంత్ర్యం సాగుతుంది. మనస్సును మట్టుపెట్టి అయినా ఆత్మధర్మాన్ని నిలపాలి, ఇది శ్రేయస్కరమైన నడవడిక. ఆత్మధర్మాన్ని అధోగతి పాలు చేసి మనస్సును పోషించుట మానవుల మనుగడ అయినది. స్వేచ్ఛగ అందరూ అన్నివైపుల సాగలాగుతుంటె స్వాతంత్ర్యం కుతంత్రం అవుతుంది, అవుతున్నది. ఏనాటికైనా, నిజకారణాన్ని తెలుసుకొని సవరించుకొని పారమార్థిక సత్యాన్ని గుర్తించి పాటిస్తేనే వ్యక్తిగతంగ ప్రజలకూ సాముహికంగ దేశానికే భావయుక్తమైన స్వాతంత్ర్యం.

---

## భగవంతునిగా, సైంటిస్ట్‌గా, వేదాంతిగా, డాక్టర్‌గా ''శ్రీకృష్ణుడు''

శ్రీకృష్ణుడు చెప్పిన సైన్స్ విషయాల్లో కొన్ని·

దేవుడు లేడని సైన్స్ చెప్తున్నట్లుగా భావిస్తారు కొంతమంది అది చాలా పొరబాటు విశ్వం ''శక్తిమయమని'' విజ్ఞానశాస్త్రం చెప్తోంది విశ్వం ''దైవశక్తిమయమని'' పురాణం అంటోంది రెండూ ఒకటే! కాకపోతే విజ్ఞాన శాస్త్రం చెప్తున్న శక్తి ని, ''దైవశక్తి'' అని వ్యవహరిస్తోంది చెప్పాలంటే సైన్సు అనేది భగవంతునిలో ఒక అంశం మాత్రమే! విశ్వంలోని అనంతమైన శక్తిని, సైన్సు అధ్యయనం చేస్తుంది ఆ అనంతశక్తి 'భగవంతుడే' కదా! అటువంటప్పుడు భగవంతునికి తెలియని సైన్సు ఏముంది? అనంత విశ్వరూపుడైన మహావిష్ణువు అవతారమే 'శ్రీకృష్ణుడు' సకల విశ్వమూ ఆయనలోనే ఉంది ఆ కృష్ణ పరమాత్ముని ద్వారా వెలువడిన కొన్ని విజ్ఞాన (సైన్స్) సత్యాల్ని తెలుసుకుందాం

శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీత కేవలం ఆధ్యాత్మిక పరమైనదే కాదు అది సకల విశ్వానికీ, ప్రకృతికీ, సృష్టికీ, జీవరాశికీ, జీవితాలకూ సంబంధించిన విజ్ఞాన సంపుటి విశ్వం మొత్తం అంతా 'విష్ణువు' అనే సైన్సు పాయింటు మనకు భగవద్గీత వల్ల స్పష్టమౌతోంది భగవద్గీతలో ఎన్నో సైన్సు విషయాలు నిక్షిప్తమై ఉన్నాయి పరిశోధించి తెలుసుకోగల ఓపిక మనకుండాలి

విశ్వంలోని సమస్త శక్తులకూ తానే మూలమని కృష్ణపరామత్మ భగవద్గీతలో చెప్పడం జరిగింది

– పోలిశెట్టి బ్రదర్స్

# గృహవాస్తు | తూర్పు దిక్కులో ఎత్తుపల్లాలు

- వాస్తురెడ్డి యాదగిరి రెడ్డి.

గృహ వాస్తులో ఎత్తు పల్లాలు ప్రాముఖ్యత ప్రధానమైనది. ఒకరి తెలివి తేటల గురించి చెప్పేటప్పుడు - వాడు ఎత్తుకు పై ఎత్తు వేస్తాడు అంటాం. అలాగే అతను ఎంత ఎత్తుకు ఎదిగాడో తెలుసా! అంటూ ఉంటాం. అంటె ఎత్తు అనే పదం అభివృద్ధిని సూచిస్తుంది. వాస్తునియమాల ప్రకారం తూర్పు దిశలో ఎత్తు పల్లాల పొత్తుకుదిరినట్లయితే మన అభివృద్ధికి ఆటంకం ఉండదు. అలా కాకుండా తూర్పులో ఎత్తు పశ్చిమంలో పల్లం ఉన్నట్లైతే మనకు విపత్తు తప్పదు. పశ్చిమంలో పల్లం తూర్పులో ఎత్తు ఉన్న ఇంటిలో ఆడవారు పెత్తనం చెలాయిస్తారు. పురుషాధిక్యత క్షీణిస్తుంది. క్రమంగా స్త్రీలు ఇటువంటి ఇండ్లకు వారసులవుతారు. ఒక్కోసారి ఇల్లు విడిచి పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కొన్ని ఇండ్లలో ఎత్తుగా ఉన్న తూర్పు పోర్షన్‌లో ఒక కుటుంబం, పల్లంగా ఉన్న పశ్చిమంలో మరొక కుటుంబం ఉన్నప్పుడు - ఆ ఇల్లు పశ్చిమంలో ఉన్న కుటుంబానికి మాత్రమే యోగిస్తుంది. తూర్పు పోర్షన్‌లో ఉన్నవారికి క్రమంగా ఇల్లు విడిచిపోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. 'విశ్వవాస్తు' లోని వాస్తవాలను గ్రహించి ముందుచూపుతో వాస్తు నియమాలను అనుసరిస్తే ముందు ముందు ఆశావహమైన సత్ఫలితాలను పొందవచ్చు.

**★ ఉత్తరంలో ఎత్తు పల్లాలు ★**

వాస్తుకు విరుద్ధంగా భారతదేశానికి ఉత్తరంలో ఎత్తైన హిమాలయ పర్వతాలున్నాయి. ''ఉత్తరంలో ఎత్తు - అప్పులతో పొత్తు'' కనుకనే భారతదేశానికి అప్పుల తిప్పలు తప్పడం లేదు. ఉత్తరంలో ఎత్తుగా (మెరకగా) ఉన్నప్పుడు సాధారణంగా దక్షిణంలో పల్లంగా ఉంటుంది. ''దక్షిణం పల్లం - తరుణి సుఖాలకు బల్లెం'' భారతదేశానికి దక్షిణంలో హిందూమహాసముద్రం రావడం వలన పల్లం అయింది. ఇది మన దేశపు అభివృద్ధికి ఆటంకం అయింది. అల్లకల్లోలాలకు అలవాలం అయింది. తద్విరుద్ధంగా, వాస్తుకనుగుణంగా అంటె ఉత్తరంలో సముద్రం, దక్షిణంలో పర్వతాలు గనక వచ్చి ఉంటె భారతదేశం ప్రపంచాన్ని శాసించే అమెరికా సరసన చేరి ఉండేది, అభివృద్ధిలో ఎవరికీ అందనంత ఎత్తుకు ఎదిగి ఉండేది. అయితే ఒక విషయంలో భారతదేశాన్ని అదృష్టం వరించింది. అదే పశ్చిమం నుండి తూర్పుకు వాలు. ఒకటి రెండు నదులను మినహాయిస్తే మనదేశంలో నదులన్నీ పశ్చిమం నుండి తూర్పునకు ప్రవహిస్తున్నాయి. కనకనే పురుషులు విదేశాలలో సహితం కీర్తికిరీటాలను అధిరోహిస్తున్నారు. స్త్రీల వరకట్నపు చావులు, బలవన్మరణాలు, కారణమేదైనా విచారించవలసిన స్థితిలో స్త్రీలు వేశ్యావృత్తిలో ఉన్నారు. వీటన్నిటికీ ప్రధాన కారణం దక్షిణం పల్లం, అదే హిందుమహా సముద్రం.

ఇంటికి ఉత్తరంలో మెరక ఉన్నా, రాళ్ళగుట్టలు ఉన్నా లేదా పేడదిబ్బలు, ఎత్తయిన ఉపగృహాలు లేదా మరే రకంగా వాస్తుకు వ్యతిరేకంగా ఉన్నా ఆ ఇంట అప్పులు తప్పవు. అలాగే ఆ ఇంటి స్త్రీకి సుఖముండదు. అన్యాయాలకు అపవాదులకు, అనారోగ్యానికి అలవాలమవుతుంది. దక్షిణంలో మెరకకు బదులుగా పల్లం, బోర్లు, బావులు, సెప్టిక్ టాంక్స్ కాలువలు ఉన్న యెడల ఆ ఇంటి స్త్రీకి నయంగాని అనారోగ్యం దరిచేరుతుంది. ఆర్థికనష్టాలు, గొడవలు లాంటి ఎన్నో కష్టనష్టాలకు ఆ ఇల్లు అలవాలమవుతుంది. ఎంత రాబడి వచ్చినా ఇట్టే ఖర్చు అవుతుంది. కుప్పలు కుప్పలుగా అప్పులు పేరుకుపోతుంటాయి. ఇంట్లో

మనశ్శాంతి ఉండదు. కొన్ని ఇండ్లలో స్త్రీ ప్రవర్తన సరిగా ఉండదు. స్త్రీ సంతానం అధికం, స్త్రీలు పెత్తనం చెలాయిస్తారు. స్త్రీల ఆస్తులుగా మారిపోతాయి. స్త్రీలు అపకీర్తికి గురి అవుతారు. ధననష్టం జరుగుతుంది. కుటుంబం విచ్ఛిన్నం అవుతుంది. అయితే ఈ దుష్ఫలితాలన్నీ దక్షిణంలోని వాస్తుదోషం పరిమాణాన్ని బట్టి పరిణామం ఉంటుంది. దోషాలు కనిపించగానే కంగారుపడిపోవలసిన అవసరంలేదు. ప్రయత్నం మానవలక్షణం. వాస్తుదోషాలను సవరించుకొని సుఖశాంతులను పొందవచ్చు.

# పరిప్రశ్న

ధర్మాచార్యులు, పీఠాధిపతులు విమానయానం, నౌకాయానం చేయరాదంటారు? నిజమా? వివరించప్రార్థన.

టి. శ్రీకాంత్, మేళ్ళచెర్వు.

శ్రీరాముడు ధర్మపాలనకోసం విమానయానం చేశాడు. అయోధ్యకు రాముడు పట్టాభిషిక్తుడు కావాలని దశరధుని కోరిక. అయోధ్యలో, మునులు తపస్సు చేసుకుంటున్న అరణ్యాభాగం రాక్షసగతమై ఉన్నది. మునులనందరిని పరామర్శించుకుంటూ నడకలోనే రాక్షసరాజ్యానికి చేరి రాక్షససంహారం చేశాడు. రామాయణమంతా ఆధ్యాత్మికతత్త్వ గర్భితమైన గ్రంధం. అయోధ్యకు రాక్షసప్రభావ విముక్తి కలిగింది. తపోధర్మం నిలిచింది, అయోధ్యలో ధర్మం నిలిచింది. 14సం॥ల గడువు తీరింది. సాధనలో ధర్మసూక్ష్మం గుర్తించిన భరతుడు, రామపాదుకలకు పట్టాభిషేకంచేసి, దైహికంగ కృశించి 14సం॥లు గడిపాడు. గడువుదాటితే భరతుడు అయోధ్యభారం వహించడు. అయోధ్యధర్మానికి రాముడే రాజు. పాలనలేని అయోధ్యధర్మం ఉండకూడదు. రాక్షసనాశనానికీ, అయోధ్యధర్మపాలనకై తావుపట్టాభిషేకానికీ కాలవ్యవధిలేదు. ఇది ఆధ్యాత్మికతత్త్వం. ఈ తత్త్వ నిరూపణకు శ్రీరాముడు విమానయానం చేసి అయోధ్యకు చేరాడు. ఇది గుణాతీతుడైన శ్రీరాముని, నిర్గుణుడైన శ్రీమన్నారాయణుని ఆచరణ. ధర్మదృష్టిలో భౌతికనియమముల ఆంక్షలు ఉండవు.

అయితే, యానములలో తిరిగే ధర్మాచార్యులు, పీఠాధిపతులు రామునివంటి ధర్మస్వరూపులేనా అని అడిగే ముందు ధర్మాన్ని విచారణ చేయాలి. సన్న్యసించిన పీఠాధిపతులకు పరోక్షంగానైనా శాస్త్రజ్ఞానం ఉంటుంది. శ్రోతలూ, ప్రజలూ సంసారదృష్టి కలవారై పరమార్థమును బరువుగ....కష్టంగా చూస్తారు, తప్పించుకోటానికే సంసిద్ధులౌతారు. శాస్త్రదృష్టిలో వారు అనర్హులే అయినా వారిని ఉద్ధరించాలనే సత్త్వగుణం బంధిస్తున్నది ప్రచారకులను ఈనాడు. ఎన్ని చెప్పినా మారని ప్రజలు, ధర్మాన్ని అనుభవంలో =-అపరోక్షంగ చూడని ప్రచారకులు, వీరిద్దరి మధ్య బోధలు లౌకికదృష్టికి దిగజారుతున్నవి. దేహాన్నీ, మనస్సునూ బంధించి అయినా పారమార్థిక దృష్టిని నిలుపుట శాశ్వతధర్మం. ఇది సహించలేరు ప్రజలు, దేహం....మనస్సూ పోషింపబడుతూ ధర్మం..., మోక్షం కావాలంటారు, ఇది అదర్మం. ఇక ఏమీ చేయలేక వారి స్థాయికి ధర్మాన్ని దింపుతున్నారు ప్రచారకులు. ఆచారనియమాలు జారిపోయినయ్. రంగంలో నిలువగలగటానికి ప్రచారకులలో పోటీలు కూడా అంకురించినయ్. ఉత్తమప్రమాణం చూపినా, విశ్వసించినా ఆచరించే శక్తియోగ్యతలు క్షీణిస్తున్నయ్. శాస్త్రప్రమాణం విని హర్షించేవారు తగ్గటమేగాక శాస్త్రప్రమాణాన్ని శంకించి.... ప్రశ్నించి....తిరస్కరించే తరుణం వచ్చింది. ధర్మం....జ్ఞానం నశిస్తున్నవి. విమానయానంచేసి దూరదేశాలకు వెళ్ళినా మతప్రచారమేగానీ ధర్మప్రచారం జరుగుటలేదు. వ్యవహారప్రధానమూ, ధర్మహీనమూ అయిన దానికి విమానయానాదులు చేయుటను గుఱించిన మీమాంస అతీతము, అందనిది.

– శ్రీకృష్ణానందమఠం – స్వామి

# భారతీయ ముస్లింలను దూరంగా వుంచాడు కెమాల్ పాషా

1923, డిశంబరు నెలలో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలతోపాటుగా అఖిల భారతీయ సభలూ జరిగాయి. అందులో తీసుకున్న నిర్ణయాలననుసరించి షియా ముస్లిం అమీర్ ఆలీ, ఖోజావర్గ నాయకుడు ఆగాఖాన్ టర్కీ వెళ్ళి కమాల్ పాషాను ఖిలాఫత్ ఆందోళన సందర్భంగా కలుసుకున్నారు. ఈ కలయిక గురించి కాంట్‌వెల్ స్మిత్ ఇలా వ్రాశాడు: ''టర్కీ ఘాజీ అమీర్ ఆలీ, ఆగాఖాన్‌లాంటి వాళ్ళను చూచి కుపితుడయ్యాడు. ఇటీవలి కాలంలో జరిగిన ఆటోమెన్ సామ్రాజ్యంమీది బ్రిటిషర్ల యుద్ధం తర్వాత కూడా బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలలో సత్సంబంధాలు పెట్టుకున్నవాళ్ళు టర్కీ ఇస్లామిక్ రాజ్యాంగం గురించి మాట్లాడుతున్నారా! అన్నాడాయన మళ్ళీ టర్కీ ముస్లింలకు, ముస్లింలుగా ఎలా వుండాలో అని ఓ షియా, మరో ఖోజా చెప్పొచ్చారా! బ్రిటిష్ పాలనకు భారత్‌లో మూల స్తంభాలుగావున్న వాళ్ళు టర్కీ జాతీయత గురించి సలహా ఇవ్వటానికి, 1924 టర్కీ ప్రజలు అబ్దుల్ మజీద్‌శ దేశ బహిష్కారం చేసి ఖిలాఫత్ పద్ధతిని పూర్తిగా నిషేధించారు.'' ఇదీ భారతీయ ఖిలాఫత్‌లకు జరిగిన సంభావన.

అంతేగాదు – ఖిలాఫత్ ఆందోళన రోజుల్లో కొందరు భారతీయ ముస్లింలు ఆఫ్ఘనిస్తాన్‌లోని తమ సోదరులతో కలిసి పనిచెయ్యటానికి అక్కడకు వలస వెళ్లారు. వాళ్లకు అక్కడ లభించిన సత్కారం అందరికీ తెలిసిందే, ఆఫ్ఘన్ జాతీయులు తమ భారతీయ ముస్లింసోదరులు తమతో ఆ దేశంలో వుండటానికి నిరాకరించారు! 'మా జాతీయ ఆర్థిక సమస్యలు పెరుగుతాయి. మీరిక్కడ వుండాల్సిన అవసరం లేదు' అని తరిమేశారు. ఇదే విశ్వ సౌభ్రాతృత్వ!

జెరూసలేంలో 1931, డిశంబర్‌లో ఇస్లాం సమావేశాలు జరిగాయి. మౌలానా షౌకత్ ఆలీ ఆ సభలతీరు చూచి పూర్తిగా నిస్పృహచెందాడు. '' సమావేశాలు అన్ని దేశాల్లో వున్న ముస్లిం సమస్యల గురించి ఆలోచించే ఇస్లాం ధోరణికన్నా అరబ్బురంగుల్ని పూసుకుంటున్నది'' అని వాపోయాడు.

మరి మనవారు ఇస్లాంకు జాతీయతలు, దేశపు ఎల్లలు, లేవు, ఏ దేశంలో వున్నా ముస్లింలంతా ఒకేజాతి అంటారు, ఇలాంటి విశ్వముస్లిం శౌకత్ ఆలీకంటే అరబ్ జాతీయులు భిన్నంగా వున్నామంటున్నారు మరి!

---

# బజరంగదళ్

సురక్ష – సేవా – సంస్కార్

భాగ్యనగర్ విభాగ్‌లో వి.హిం.ప. బజరంగదళ్ కార్యక్రమాలు 6.7.97 నుండి వరుసగా ప్రతి ఆదివారం జరుగుతున్నాయి.

వ్యాయామం ప్రధానంగా ఆత్మరక్షణార్థం దండ, నాన్‌చాక్, తల్వార్, నియుద్ధలోని మెళుకువలు నేర్పబడుతున్నవి. అని బజరంగ్‌దళ్ శ్యామ్ తెలియజేశారు.

# అశ్లీలతపై అతివల విజయభేరి

జూలై 11న కర్నూలు జిల్లా కోవెల కుంట్లలో విభాగ్ ప్రముఖ్ శ్రీమతి విజయలక్ష్మి గారి నాయకత్వంలో మహిళలతో ర్యాలీ, నిర్వహించబడింది. ప్రచార, ప్రసార సాధనాల్లో, వాణిజ్య ప్రకటనల్లో చలన చిత్రాల్లో వున్న అసభ్యత అశ్లీలతను తొలగించాలని కోరుతూ , మహిళా చైతన్య వేదిక, దుర్గావాహిని, స్థానిక పొదుపు లక్ష్మి సంఘాలు మహిళలు సమైక్యంగా నిర్వహించిన ఈర్యాలీలో 8 గ్రామాలనుండి అధిక సంఖ్యలో మాతృమండలి మహిళలేకాక స్థానిక M.L.A. గారి శ్రీమతి, అల్లూరు గ్రామ మహిళా సర్పంచ్ నారాయణమ్మ గారు, M D O శ్రీమతి ఉమామహేశ్వరి గారు కూడా ఈర్యాలీలో పాల్గొని పట్టణ వీధుల వెంట నడవటం పలువురి దృష్టి నాకర్షించింది. పాండురంగస్వామి దేవాలయం నుండి R T C. బస్టాండ్ మీదుగా బయలు దేరిన మహిళలు పంచాయితీ కార్యాలయంలో, పోలీసు అధికారులకు వినతి పత్రాలు సమర్పించి మెయిన్ బజారు నుండి M R O. ఆఫీసు చేరి వినతి పత్రం సమర్పించారు. ఈ సందర్భంగా కర్నూలు జిల్లా దుర్గావాహిని ప్రముఖ్ శ్రీమతి లక్ష్మి దేవి సహ ప్రముఖ్ పార్వతమ్మ గారు, సరస్వతమ్మ గారు భజరంగదల్ విభాగ్ ప్రముఖ్ శ్రీ రామిరెడ్డి గార్లు పాల్గొని ర్యాలీని విజయవంతం చేశారు. జూలై 15న ఆదోనిలో అశ్లీలతను వ్యతిరేకిస్తూ మహిళలు జరిపిన ర్యాలిలో అనేక మహిళా సంఘాలు దుర్గావాహిని, విశ్వహిందూ పరిషత్ మాతృమండలి మహిళలు అత్యధిక సంఖ్యలో M R O కు వినతి పత్రం సమర్పించటం జరిగింది. స్థానికంగా బ్లూఫిల్మ్‌లు, అశ్లీల చిత్రాలు ప్రదర్శించే థియేటర్ల ముందు తమ నిరసన తెల్పుతూ నినాదాలతో మహిళలంతా బైఠాయించడంతో స్పందించిన అధికారులు సత్వర చర్యలు గైకొనటం పట్టణంలో అలాంటివి ప్రదిర్శంచే రెండు థియేటర్లను మూసి వేయించడం ర్యాలీ సాధించిన ఘనవిజయం.

**జూలై 19న** కర్నూలు నగరంలో శ్రీమతి లక్ష్మి దేవి గారి ఆధ్వర్యంలో నిర్వహించబడి అధ్యక్షురాలు శ్రీమతి సోమిశెట్టి. శశికళ కార్యాధ్యక్షురాలు మహిళా చైతన్యవేదిక దుర్గావాహిని మహిళా యువమోర్చ అన్ని మహిళా సంఘాలు కలిసి దాదాపు 800 మంది మహిళలతో బయల్దేరిన ర్యాలీ స్థానిక లక్ష్మి నరసింహ కళ్యాణ మంటపం నుండి బయలు దేరి పాతబస్టాండ్, కిడ్స్ వరల్డ్ మీదుగా రాజవిహార్ చేరి అక్కడ మహిళాహారంగా ఏర్పడి అశ్లీలత బొమ్మను తగలబెట్టి, నినాదాలతో కలెక్టరు గారి కార్యాలయం చేరి వారికి వినతి పత్రం సమర్పించారు. ఈ ర్యాలీలలో ప్రాంత మహిళా ప్రముఖ్ శ్రీమతి చాముండేశ్వరి గారు, రాయల సీమ విభాగ్ మహిళా ప్రముఖ్ శ్రీమతి విజయలక్ష్మిగారు పాల్గొని మహిళలనుద్దేశించి స్ఫూర్తిదాయకంగా సందేశమిచ్చారు శ్రీమతి వసుధ, శ్రీమతి పార్వతమ్మగారు శ్రీమతి సరస్వతమ్మ గారి సమైక్యత కృషితో కార్యక్రమం విజయవంతంగా జరిగింది.

**జూలై 19న అనంతపురంలో** దాదాపు 3 వేల సంఖ్యలో మహిళాజన వాహినీ ర్యాలి జరిగింది. విశ్వహిందూ పరిషత్ మాతృ - మండలి, లైన్స్‌క్లబ్ మహిళలు అనేక మహిళా సంఘాలు కలిసి నిర్వహించిన ర్యాలీలో కలెక్టరు గారి సతీమణి, అనేక మంది విద్యాధికులు, ఉద్యోగినులతో D.S.P. గారి సతీమణిగారు కూడా పాల్గొనడం విశేషం.

మహిళలతో నిర్వహించబడిన ఈ ర్యాలీల విజయం గురించి అనంతపురం విభాగ్ మహిళా ప్రముఖ్ శ్రీమతి విజయలక్ష్మి గారు మట్లాడుతూ ''భవిష్యత్తులో మహిళా ఉద్యమాల విజయానికిది నాంది'' అంటూ తమ హర్షాన్ని వెలిబుచ్చారు.

ఫోటోలు 3వ కవర్‌లో

# తరిగొండ వెంకమ్మ (1730-1817)

భక్తికీ బ్రహ్మానుభవానికీ కులమతాలు వర్ణవర్గాలు స్త్రీపురుషులు అనే భేదాలు అడ్డుకావనటానికి ప్రపంచదేశాలన్నిటా దృష్టాంతాలున్నవి. మనదేశంలో వేదకాలంనుండి బ్రహ్మవాదినులున్నారు. ఆంధ్రదేశంలో అన్ని కులాల్లోను భగవత్సాక్షాత్కారమూ బ్రహ్మానుభవమూ పొందిన తల్లులెందరో ఉన్నారు. అట్టివారిలో తరిగొండ వెంకమ్మ ప్రముఖురాలు. తెలుగు సాహిత్య చరిత్రలో ఆమెది విశిష్టస్థానం. గొప్ప కవయిత్రిగానే కాక యోగ విజ్ఞానానికి సంబంధించిన రెండు ఉత్తమ గ్రంథాలు రచించటం చేత వెంకమ్మను ఆంధ్రయోగినుల్లో అగ్రేసరురాలుగా సంభావించవలెను. తరిగొండలో జన్మించటంచేత ఆమెను తరిగొండ వెంగమ్మ వెంకమ్మ అంటున్నారు. తరిగొండ చిత్తూరు జిల్లా వాయుల్పాడు తాలూకా కేంద్రానికి ఉత్తరాన రెండు కోసుల దూరాన ఉన్నది. అది లక్ష్మీ నరసింహక్షేత్రం. కర్నూలు జిల్లా కానాలనుండి వసిష్ఠగోత్రికులు నందవరీకులు కొందరు వచ్చి తరిగొండలో ఎన్నడో స్థిరపడ్డారు. వారి సంతతిలో కానాల కృష్ణయ్య ఒకరు. ఆయన భార్య మంగమ్మ. దంపతులిద్దరూ ధర్మ పరాయణులు, తరిగొండ లక్ష్మీ నరసింహస్వామి భక్తులు. వాళ్ళకు చాలా కాలందాక సంతానం కలుగనందున తిరుమలకు పోయి వెంకటేశ్వర స్వామికి మ్రొక్కుకొని వచ్చినారు. స్వామి అనుగ్రహంతో వారికి ఒక అందాల బిడ్డ పుట్టింది. అందువలన ఆమెకు వెంగమ్మ – వెంకమ్మ అని పేరు పెట్టినారు. లేకలేక కలిగిన సంతానం కనుక వెంకమ్మ శైశవం అల్లారు ముద్దుగా గడచింది. మంగమ్మ కృష్ణయ్యలు తమ ఇలువేలుపు లక్ష్మీనరసింహ స్వామిని, బిడ్డను ప్రసాదించిన వెంకటేశ్వర స్వామిని అభేదంగా సేవిస్తూంటే ఆ కైంకర్యంలో శిశువు వెంకమ్మ పాలు పంచుకునేది. ఆ దృశ్యం కన్న వారికీ కనుగొన్న వారికీ ఆనందదాయకం. తరతరాలుగా సాహిత్య వాతావరణం ఉన్న ఆయింటిలో వెంకమ్మకు సాహిత్యమూ భక్తీ సహజంగా అబ్బినవి.

వెంకమ్మ పెరిగిన కొలది ఆమె భక్తీ పెరిగింది. అది తల్లి దండ్రులకు ఇబ్బందిగా ఉండేది. తోటిపిల్లలతో ఆడుకోకుండా వెంకమ్మ మైమరచి భగవత్సంకీర్తనం చేస్తూ నాట్యం చేస్తుంటే కృష్ణయ్యకు ఆందోళన ఎక్కువైనది. ఆమె మనస్సు మారటానికి ఇంటిపనులు ఎక్కువగా చెప్పేవారు. ఆ పనులు త్వరగా చేస్తూ ఆమె భక్తిభావం మరింత దృఢపరచుకున్నది. పెండ్లి చేస్తే మారవచ్చునని వరాన్వేషణ చేస్తుంటే ఆమె తనకు లౌకికమైన వివాహం అక్కరలేదని భగవంతుడే తన భర్త అని తండ్రికి ధైర్యంగా చెప్పింది. ఆయన వెంకమ్మను తీవ్రంగా మందలించి చిత్తూరు సమీపం నారగుంట-పాళెం వాస్తవ్యులు శ్రీ వత్సగోత్రికులు ఇంజేటి తిమ్మయ్యకొడుకు వెంకటాచలపతితో మూడుముడులు వేయించినాడు. త్రికరణ శుద్ధిగా శ్రీనివాసుని కంకితమైన తనను ఎవరికో ధారాదత్తం చేసినందుకు తండ్రిని విమర్శించి వెంకమ్మ తన భక్తి సాధనలు కొనసాగించింది. ఆమె వ్యక్తురాలైన తరువాత పుట్టింట నిషేకం ఏర్పాటు చేసినారు. శోభనగృహంలో భర్తతో వెంకమ్మ తన సర్వస్వం వెంకటేశ్వర స్వామికి అంకితం కనుక తనను

శరీరసుఖానికై నిర్బంధించ వద్దని ఖండితంగా చెప్పింది. ఆమె భక్తికీ వైరాగ్యధోరణికి అబ్బురపడి వెంకటాచలపతి వేకువనే తన గ్రామానికి తిరిగిపోయినాడనీ, పడకగదిలో వెంకమ్మ తమ కులదేవత చౌడేశ్వరివలె కనపడటం చేత భయపడి వెళ్ళి పోయినాడనీ కథలు ప్రచారంలో ఉన్నవి. సౌందర్యవతియైన భార్యతో కాపురం చేసే భాగ్యం కోలుపోయిన విచారంతో మనోవేదనపాలై వెంకటాచలపతి అనతికాలంలోనే తీవ్రంగా జబ్బుపడి చనిపోయినాడు. విరక్తయైన వెంకమ్మకు భర్తమరణం వెంటేశ్వరస్వామిపై భక్తిని దృఢతరం చేసింది. ఆమె వైరాగ్యం మారాకులు తొడిగింది. వివేక వైరాగ్యాలతో పాటు సుజ్ఞానం సహజంగా అబ్బిన వెంకమ్మ నాటి సమాజం కట్టుబాట్లను తృణీకరించి వెంకటరమణుడే తన భర్త అని బాహాటంగా చాటి మాంగల్య చిహ్నాలు తీసి వేయలేదు. నాటి బ్రాహ్మణులు ఆమెకూ ఆమె తండ్రికీ సంఘమర్యాదలు బోధించినారు. వెంకమ్మ తల్లిందండ్రులు సంఘానికి భయపడితే ఆమె బుద్ధి వైభవంతో వైరాగ్యంతో వారికి నచ్చ చెప్పి సంఘాన్ని ఎదిరించి నిలిచింది. కూతురు కోరిన శ్రేయోమార్గమే మంచిదనుకున్న కృష్ణయ్య మదనపల్లిలో ఉండే ఆధ్యాత్మిక విద్యావేత్త రూపావతారం సుబ్రహ్మణ్య శాస్త్రుల వద్దకు పోయి ఆమెకు బ్రహ్మవిద్యోపదేశం చేయవలసిందిగా అభ్యర్థించినాడు. శాస్త్రులు అందుకంగీకరించినాడు.

సుబ్రహ్మణ్య శాస్త్రులు తమ ఉపాస్యదైవం సోమేశ్వరస్వామి సన్నిధిలో వెంకమ్మకు వేదాంతం బోధించినాడు. వెంకమ్మ గురువులను త్రిమూర్తిస్వరూపుడుగా కొలచింది. ఆమె భక్తి జ్ఞాన వైరాగ్యాలకు మెచ్చి గురువు మంత్రోపదేశం చేసి భక్తితత్త్వాన్ని యోగ శాస్త్ర రహస్యాలను వివరించినాడు. తీవ్ర సాధనలతో ఆమె జ్ఞానం పక్వమైనది. దేశికుడు సంతృప్తుడై మరికొన్ని సాధనమార్గాలు, మెలకువలు, చెప్పి దీవించి వెంకమ్మను తరిగొండకు పంపినాడు. పితృగృహానికి తిరిగి వచ్చిన వెంకమ్మ దినంలో చాలా భాగం లక్ష్మీనరసింహస్వామి ఆలయంలో గడుపుతుండేది. ఆ గుడిలోనే ఒకవైపున ఉన్న ఆంజనేయ స్వామి విగ్రహం చాటున ఏకాంత ప్రదేశంలో యోగసమాధిలో ఉండేది. ఈ విషయం ఎవ్వరికీ తెలియదు. తక్కిన సమయాల్లో ఇంటి పట్టున భక్తికవితారచనలు చేస్తుండేది. వెంకమ్మ భక్తిసాహిత్యంలో తొలిరచన తరిగొండ నృసింహ శతకం. రెండవ కృతి ప్రహ్లాద చరిత్ర ఆధారంగా రచించిన నృసింహ విలాసకథ – యక్షగానం. ఈ రెండు కృతులూ తరిగొండ నృసింహస్వామికి అంకితం. మూడవ కృతి శివ విలాసయక్షగానం రాచవీటి – (రాయచోటి) వీరభద్ర స్వామికి అంకితం. అందాలరాశి, నవయౌవన, విగతభర్తృక, వెంకమ్మ నృసింహాలయానికి రాకపోకలు చేస్తుంటే కుమతులు కొందరు ఎగతాళి చేస్తుండేవారు; కొందరు దుష్ప్రచారం సాగించినారు. ఆమె సమస్తభారం లక్ష్మీ నరసింహ స్వామిపై వేసి యోగ సాధన, కవితా తపస్సు, కొనసాగించింది. యోగంవలె ఆమె కవిత్వం దినదినం పరిపక్వ స్థితికి చేరింది. ఈ కాలంలోనే ఆమె రాజయోగామృత సారమనే తాత్త్విక ద్విపదకావ్యం నరసింహ స్వామికంకితంగాను, బాలకృష్ణ నాటకమనే యక్షగానం వాసుదేవ పరబ్రహ్మకంకితంగాను రచించినది.

వెంకమ్మ వైరాగ్యం వేదాంత ధోరణి తరిగొండ బ్రాహ్మణులకు నచ్చలేదు. ఆమెపై నిందలు మోపి గేలిచేస్తుంటే ఆమె సరకు చేయలేదు. కొందరికి పట్టుదల పెరిగి ఆమెకు వైధవ్య లక్షణమైన శిరోముండనం చేయించకపోతే కృష్ణయ్యను బ్రాహ్మణసంఘంనుండి వెలివేస్తామన్నారు. కూతురుపై ఎంత ప్రేమ విశ్వాసాలున్నా కృష్ణయ్య సంఘానికి భయపడి వెంకమ్మకు శిరోముండనం చేయించటానికి పూనుకున్నాడు. వెంకమ్మ నరసింహస్వామిపై భారం వేసి ధ్యానం చేస్తూ తలవంచింది. తల కొరగటానికి వచ్చిన మంగలికి గుండెదడ పుట్టి చేయాడలేదు, పులిని చూచిన లేడివలె భయభ్రాంతుడైనాడు. ఆ వినోదం చూడటానికి వచ్చిన విప్రబృందానికి అదే గతి పట్టింది. శిరోముండనం ఆగిపోయింది. కాని పూర్వాచారపరాయణులైన బ్రాహ్మణులు పుష్పగిరి పీఠాధిపతులకు వెంకమ్మ వలన తమ సంఘానికి జరుగుతున్న అపచారం తెలియజేసినారు.

అప్పటి పుష్పగిరి పీఠాధిపతులు శ్రీమదభినవోద్దండ విద్యా నృసింహ భారతీ స్వాములవారు ముందుగా శ్రీముఖం పంపి తాము బయలుదేరి వచ్చినారు. జగద్గురువులు దేవాలయంలో విడిది చేసి వెంకమ్మను తీసుకురావటానికి పరిచారకులను పంపినారు. ఆమె భోజనానంతరం వస్తానన్నది. ఆమె సమాధానం జగద్గురువులకు ఆశ్చర్యావేశాలను విప్రబృందానికి కోపతాపాలను కలిగించింది. శిరోముండనం చేయించుకోని విధవను చూడరాదని జగద్గురువులు తెరకట్టించినారు. ఆమె వచ్చి తెరచాటున నిలిచింది. స్వామివారు సదాచారాలు, కులవధూవర్తనం, బ్రాహ్మణస్త్రీ ధర్మం బోధించి వితంతువుకు ఉచితమైన శిరోముండనం చేయించుకొమ్మని ఆదేశించినారు. తెరచాటునుండే వెంకమ్మ ప్రతివాదం ప్రారంభించింది. పతివ్రత పరపురుషుని ముట్టరాదు గదా? పరపురుషుడైన మంగలిని తానెట్లు ముట్టగలననీ, కేశాలుంటే తొలగిపోయే, కేశాలు తీయిస్తే నిలిచే పాతివ్రత్య ధర్మం ఏ శాస్త్రంలో ఉన్నదనీ, వెంట్రుకలు తీయించటానికి ఆదేశించే జగద్గురువులు వెంట్రుకలు మరల మొలవకుండా ఆదేశించగలరా అని ధైర్యంగా ప్రశ్నించినది. ఆమె సహేతుక ప్రశ్నలకూ, తమకు నమస్కరించనందుకూ, జగద్గురువులకు కోపం ఆశ్చర్యం కలిగింది. జగద్గువులకు ఏల నమస్కరించలేదని ప్రశ్నిస్తే ఆ సింహాసనంనుండి జగద్గురువులు లేచి ప్రక్కకు జరిగితే నమస్కరిస్తానన్నది. ఆమె మాటాల్లో ఏదో పరమార్థం ఉంటుందని జగద్గురువులు తెరతీయించి తాము లేచి ప్రక్కకు తొలగినారు. వెంకమ్మ లక్ష్మీ నరసింహస్వామిని ధ్యానిస్తూ రెండు చేతులు జోడించి నమస్కరించింది. వెంటనే సింహాసనం భగ్గున మండి కాలి పోయింది. జగద్గురువులు భయభ్రాంతులై వెంకమ్మ ప్రహ్లాదావతారమంటూ తామే నమస్కరించి ఆమెను ప్రశంసించి విప్రమండలిని మందలించి వెళ్లి పోయినారు. బ్రాహ్మణ సంఘం అవమానం పాలైనది. బ్రాహ్మణులు కృష్ణయ్య ఇంటికి రాకపోకలు మాని వెలివేసినట్లు ప్రవర్తిస్తుంటే నిస్సహాయుడైన కృష్ణయ్య తన బ్రతుకు, కన్నకూతురు మూలంగా పరిహాస భాజనమైనందుకు ఏడ్చి విసుగుతో వెంకమ్మను ఇంటినుండి వెళ్ళిపొమ్మన్నాడు.

(సశేషం)

# ఆదినుండి ఆధునికం వరకు - స్త్రీ

## ధర్మశాస్త్రాలు - స్త్రీలు

- డి. జి. విజయలక్ష్మి

ధర్మశాస్త్రాలో ప్రధమంగా పేర్కొనబడు మనుధర్మశాస్త్రంలో 2700 శ్లోకాల్లో ఎక్కడా స్త్రీని కించపర్చేది లేదని విజ్ఞులు విశదీకరిస్తున్నారు. అప్రధగా తోచిన శ్లోకాన్ని కూడా విశ్లేషించి సమంజసంగా సమ్మానించారు. అలాగే ఇతర ధర్మశాస్త్రాలు కూడా స్త్రీలవిషయంలో ఉదారతనే చూపాయి. ఉన్నతంగా చూశాయి.

పురాకల్పే కుమారీణాం మౌంజీ బంధన మిష్యతే।
అధ్యాపనంచ వేదానాం సావిత్రీవచనం తథా॥

బాలికలకు చక్కగా ఉపనయన సంస్కారాలు గావించి, వేద పఠనమునకు అధికా రము కల్గి, అన్ని విద్యల నభ్యసించి విదుషీమణులుగా విఖ్యాతినొందారని భావం. మైత్రేయి, గార్గి, అపాల, విశ్వార, వాక్, సూర్య, రోమశ, మమత, ఘోష, మదాలస, సులభ, లోపాముద్ర మొదలగు విదుషీమణులు, జ్ఞానార్జనకు స్త్రీ పురుష భేదం లేదని, అందరికీ సమానాధికారం వుందని, ఋజువు చేశారు. అన్నిరకాల ధర్మకార్యాల్లో తప్పకుండా భార్య అనుమతి తీసుకుని ఆచరించాలి. భార్యలో కల్సి ఆచరించాలి అని ఆపస్తంభధర్మ సూత్రములో చెప్పబడింది. వివాహ సమయంలో ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి అని పల్కించటంలో భాష్యం ధర్మార్థ కామములందు నిన్ను అతిక్రమించను అని బాసచేయటమే. దీని ప్రకారం వివాహానంతరం భార్య భర్తకు సహగామిగా మారుతుంది. కనుక విభజన అసంభవం.

## హారితధర్మశాస్త్రంలో-

భార్యయా వ్యభిచారిణ్యాః పరిత్యాగోన విద్యతే॥ అని చెప్పబడింది. భార్య వ్యభిచారిణి యైనను ఆమెను వదిలిపెట్టరాదు. సాధారణంగా మనము వ్యభిచారమంటే పడుపు వృత్తిగా భావిస్తాం. కొన్ని ధర్మ శాస్త్రాల్లో వివాహసమయంలో చేసుకున్న నియమాల్ని, ప్రతిజ్ఞల్ని ఉల్లఘించి చర్చించుట వ్యభిచారం. ''అన్యోన్యస్యావ్యభిచారో భవేదామరణాంతికః'' అంటే జీవితాంతం, మరణం ప్రాప్తించేవరకు భార్యభర్తలమధ్య పరస్పరం ఏ విధమైన వ్యభిచారం జరగకూడదంటూ నిర్దేశించారు. ఒకవేళ జరిగితే శిక్ష కూడా చెప్పారు. అయితే ఈ శిక్ష విషయంలో కూడా ఉదారత్వమే!

నియమోల్లంఘన చేసిన స్త్రీ పశ్చాత్తాపంతో ప్రాయశ్చిత్తం కోరుకుంటే ఆమెకు భూశయనం దండనగా విధించబడుతుంది. అదే పురుషుడు ఏ విధమైన అధర్మము అకృత్యము, చేసినా కఠిన దండన చెప్పబడింది.

''దారవ్యతిక్రమీ ఖరాజినం బహిర్లోమ పరిధాయ, దారవ్యతిక్రమిణే భిక్షమ్ - ఇతి సప్తగారాణి చరేత సావృత్తిషణ్మాసాన్ ''అని ఆపస్తంభ ధర్మ సూత్రంలో చెప్పబడింది. అంటే వ్యభిచరించిన పురుషుడు గాడిదచర్మం ధరించి, ఆరునెలల పర్యంతం రోజూ ఏడు ఇళ్లలో'' ''భార్య నతిక్రమించి ప్రవర్తించిన వాడికి భిక్షపెట్టండి'' అంటూ భిక్షాటన చెయ్యాలి. ప్రతిరోజూ, తన తప్పును చెప్పుకుంటూ, ఒప్పుకుంటూ, ఇల్లిల్లూ తిరగటమనేది మరణశిక్షకంటే క్లిష్టమైనది. అంటే ఇక్కడ స్త్రీ కొక న్యాయం

పురుషులకొక న్యాయమా అని తర్కించేవారు లేకపోలేదు. సహజంగా స్త్రీలు సరళ స్వభావులు. ఎంతటి దుష్టుడైనా భర్తను సంస్కరించ ప్రయత్నిస్తారేకాని, వదిలివేయటమో అన్యులనాశ్రయించ డమో చేయరు. ఒకవేళ అతనే అలాచేస్తే అతనిలో మార్పు కోసం ప్రయత్నించటమో, నిరీక్షించటమో చేస్తారు కాని మరొకర్ని పెళ్లాడాలనుకోరు. స్వభావ విరుద్ధంగా అజ్ఞులు ఎప్పుడైనా ఎవరైనా అలా చేస్తే వారి పరిస్థితులపట్ల సానుభూతితో లఘుతరమైన శిక్ష చెప్పబడింది. విజ్ఞులు తమ విచక్షణతో ఎలాంటి పరిస్థితులైనా చక్కబెట్టుకోగలరు. ఇక పురుషులకు బహు భార్యత్వం వుంది. భార్య అనుమతితో మరో వివాహం చేసుకునే అనుకూలం వుండేది. సామాన్యంగా ఏ స్త్రీ సపత్నిని కోరుకోదు. భర్తలో భాగం పంచటాని కిచ్చగించదుకూడ. కనుక ఆమె అనుమతి లేకుండా వ్యభిచరిస్తే కఠిన శిక్షకు గురి కావల్సిందేనని శాసించారన్నమాట! అలాగే పురుషుని నియంత్రణకై అనేక కర్తవ్య నియమాలు ఆదేశించాయి ధర్మశాస్త్రాలు, కానీ స్త్రీ కెలాంటి నియంత్రణ వున్నట్టు కన్పడదు. ఇంకా తల్లిదండ్రులు పతితులైతే కూతురు పతితగా యెంచబడదు. ఉన్నతకులజుడు, ఉత్తమగుణవంతుడైన పురుషుడు ఆమెను వివాహం చేసుకొనవచ్చునని, అదే పుత్రుడైతే పతితుడుగానే ఎంచబడునని యాజ్ఞవల్క్య స్మృతిలోనూ, అదేభావం ఆపస్తంభ ధర్మ సూత్రములోనూ చెప్పబడింది. తల్లి దోషము చేసినా క్షమార్హయేనని చెప్పిన ఆపస్తంభ, వాసిష్ట, బోధాయన ధర్మశాస్త్రాలు తండ్రిపై ఈ కృప చూపలేదు. శిక్షా స్మృతిలో స్త్రీ పురుషులిద్దరి దోషాలకు దండన అవసరమే. అయితే స్త్రీపై విశ్వాసంతో, స్త్రీ సమస్యల పట్ల సానుభూతితో, స్త్రీ పరిస్థితుల పట్ల సదవగాహనతో దండనలో exemption వుండేదనేదిక్కడ సుస్పష్టం.

అశ్వలాయన శౌత్రసూత్రంలో 1వ అధ్యాయంలో 11వ మంత్రం ''ఇమం మంత్రం పత్నీ పఠేత్'' అన్నారు. కేవలం స్త్రీలే పఠించదగిన మంత్రాలు కొన్ని లభించబడ్డాయి. ఇలా ధర్మ శాస్త్రాల్లో స్త్రీ ప్రజ్ఞా పాటవాలకు ప్రశంసలు, దండన విషయంలో ఉదారతలు, జీవనవిధానంలో సౌలభ్యాలు చెప్పబడ్డాయి కాని ఎక్కడా రూక్షిత చూపినట్లు కన్పడదు. అయితే పూర్వకాలంలో పతివ్రతలు, పాతివ్రత్య ధర్మాలంటూ స్త్రీలను గిరిగీసి వుంచేవారని, పురుషులకలాంటి నియమాలు లేవని వాదించే వనితలకు, పత్నీవ్రతులు కూడ వున్నారనటానికి నిదర్శనం రామాయణం అంతేకాదు పత్నీవ్రతధర్మాలు కూడ చెప్పబడ్డాయి అధర్వవేదంలో

అహం వదామి నేత్త్వం సభయామహత్వం వద।
మమేద సస్త్వం కేవలో నాన్యాసా కీర్తయాశ్చన॥

తన భర్తను తప్ప పరపురుషుల పేరును కూడ తలచకుండుట స్త్రీకి పరమ ధర్మముగా చెప్పినట్లే, పతికూడ తన సతినితప్ప తలచరాదని, అన్యస్త్రీలతో ఏకాంతమున మాట్లాడటం కూడ నిషేధమని, సభ, సమూహములందు నిస్సందేహముగా మాట్లాడ వచ్చునని పైశ్లోకము యొక్క భావము. మాతృవత్ పరదారేషు అని ఆర్యోక్తి. పరస్త్రీని తల్లివలె భావించుట ఉత్తమ సౌశీల్య లక్షణము. పరస్త్రీ పేరుకూడ తలచ కూడదనుట సతీవ్రతం కాదా? తన భార్య పరపురుషుని కలనైన తలపరాదని, ఆమెప్రేమ తనకే స్వంతంకావాలని తలపోసినట్లే భార్య మాత్రం కోరుకోదా? ఈ నియమాలను పాటించనిదుర్బల మనస్కుడు పత్నీ ద్రోహి అని తెల్పే మంత్రం కూడ వుంది. కనుక భార్యాభర్త ఇరువురి మధ్య సదవగాహన ప్రేమ, విశ్వాసం వుండాలని, తారతమ్యాలు కావని ప్రవహించేలా ఇరువురిపట్ల శ్రద్ధతో ధర్మాలు, శాసనాలు, మన్ననలు, దండనలు ఎన్నో ధర్మ శాస్త్రాలలో పొందుపర్చబడ్డాయి కాని ఒకరెక్కువ మరొకరు తక్కువగా కించపర్చబడలేదు.

( సశేషం : )

# సంస్కృత జయంతి కానుక

సనాతనమయిన భారతీయ సంస్కృతియే భారతీయుల జీవనాభివృద్ధికి ప్రధాన కారణము. ఆ సంస్కృతిని సంరక్షణ చేయు రక్షణ కవచము సంస్కృతము. సంస్కృతము శరీరమునిండియున్న చైతన్యమువంటిది. సంస్కృతి చైతన్యముచే ప్రేరితమయి సర్వకార్యములను నిర్వహించు శరీరమువంటిది. చైతన్యము లేని శరీరము, శరీరములేని చైతన్యము వ్యర్థములు. కావున సంస్కృతిని రక్షించుటకు సంస్కృతము అత్యవసరము. సంస్కృతము నిలిచియున్నంత కాలము సంస్కృతి నిలిచియుండును. సంస్కృతము నశించిన సంస్కృతి నశించితీరును.

భారత కేంద్రప్రభుత్వము సంస్కృత భాషాభివృద్ధిని కోరి శ్రావణ పూర్ణిమను (18.8.97) సంస్కృత జయంతిగా నిర్ణయించినది. దానిని ప్రోత్సాహముగా తీసుకొని దేశభక్తులయిన ప్రతివారికి ఆరోజున ఏదో ఒక సంస్కృత గ్రంథమును పారాయణచేయవలసి యున్నది. ఆభావనతోనే శ్రీ జానకీ సేవా సమాజమువారు ఆదికావ్యమయిన రామాయణమును ఇంటింట ప్రచారము చేయుచున్నారు. వారు తాము ప్రకటించిన వాల్మీకి రామాయణము నందలి బాల అయోధ్య అరణ్య కాండలను రు 71-00ల విలువ గలవానిని ఆసక్తిగలవారందరికి రు40-00లకు (తగ్గింపుధరకు) బహుమానముగ ఇవ్వదలచి యున్నారు.

వివరములకు వేంపటి లక్ష్మీ నారాయణశాస్త్రి, లలితా విద్యా మందిరము. కేదారేశ్వరపేట, విజయవాడ - 3.

# గోహత్య పాపం

హిందువులు నరం కత్తిరించుకోవడం, ఆపరేషన్ ద్వారా సంతాన నిరోధం చేయించుకుంటే వారికి పుట్టవలసిన సంతానం, ఆపరేషన్ చేయించుకొనని అన్యమతస్థుల యిళ్లలో పుడుతోంది. ఎలాగయితే ఇప్పటికే హిందువులలో దాదాపు పన్నెండు కోట్ల శిశువుల జన్మ అరికట్టబడిందో, ఆ పన్నెండు కోట్ల శిశువులు గోఘాతకులైన అన్యమత స్థులయిండ్లలో పుడుతుంటే యితర మతస్థుల సంఖ్య హిందువుల సంఖ్యకంటె ఇర్వై నాలుగు కోట్లు పెరుగుతోంది, ఇతర మతస్థుల సంఖ్య పెరిగిందంటే వాళ్లు హిందువుల్నే నాశనం చేస్తారు. కాబట్టి హిందువులు తమ సంతాన పరంపరని నష్టపరచకూడదు! గోఘాతకుల సంఖ్య పెంచి గోహత్య పాపంలో భాగస్థులు కారాదు.

స్వామి రామసుఖదాసు

''మహాపాపం నుంచి కాపాడుకో''

గీతాప్రెస్ - గోరఖ్‌పూర్ సేకరణ విశ్వనాథశర్మ

# లేఖ

ఎడిటర్‌గార్కి నమస్తే.

ఈశ్వర నామ సంవత్సర జ్యేష్ఠమాస ''విశ్వహిందు'' పత్రిక చదివాను.

''ఆది నుండి ఆధునికం వరకు స్త్రీ'' వ్యాసం బావుంటూంది. ఇతర శీర్షికలు కూడా బాగానే వున్నాయి.

21వ పేజీలో ''అతని ప్రశ్న చదివాక యీ వుత్తరం వ్రాయాలనిపించింది. ఎందుకంటే అదే ప్రశ్న గతరెండేళ్ళుగా నన్ను యెందరో అడగటం నేను చెప్పటం, ఒక్కోసారి వాదోపవాదాలు జరగటం కూడా జరిగింది.

ఈ విధంగా ప్రజల్లో మూర్ఖత్వం పెరిగిపోతుండటం చూసి బాధపడ్డాము.

వారు '' ఎవడో యేనాడో రామాలయాన్ని కూల్చి తప్పుచేశాడని, యీనాడు మనం అదే తప్పు చేయవచ్చా?'' అనీ ''నాలుగువందల యేళ్ళు వారి అధీనంలో వున్న దాన్ని బలవంతంగా వశపరచుకోవటం తప్పుకదా!'' అనీ అడుగుతూంటే నాకు వారి ప్రశ్న వింటుంటే యేమనిపిస్తుందో .......

''రావణుడు దుర్మార్గుడు కనుక సీతమ్మను యెత్తుకుపోయి సంవత్సరం పాటు తన అధీనంలో వుంచుకున్నాడు. అలాంటి సీతను తిరిగి యిచ్చివేయమనటం తప్పుకాదూ! రావణుడ్ని బంధుమిత్ర సహితంగా చంపేయటం, సీతను లాక్కోవటం తప్పుకదా! రావణుడు దుర్మార్గుడై తప్పు చేశాడు. శ్రీరాముడు కూడా అలా దౌర్జన్యం చేయవచ్చా?'' అని అడుగుతున్నట్లు అనిపిస్తుంది.

''బ్రిటిషువారు దుర్మార్గులు కనుక మన దేశాన్ని ఆక్రమించారు మనం తిరిగి వారినుండి వశపరచుకోవటం తప్పుకాదూ! పాపం వారు 200 ఏండ్లుగా యేలుకుంటున్న దేశాన్ని తిరిగి యిచ్చివేయమని స్వాతంత్ర్య సమరం చేయటం తప్పుకదూ!'' అని అడిగినట్లనిపించింది.

ఇలాంటి ప్రశ్నలు యెంత మూర్ఖమయినవో ''అతని ప్రశ్న'' కూడా అంతే మూర్ఖమయినది.

అదే మన దౌర్భాగ్యం. అయోధ్య, మధుర, కాశీలు మన ఉమ్మడి సంపద కనుక దాన్ని పరాయివారు కాజేసినా మనకు నొప్పిలోచటం లేదు. అదే.... యీ ప్రశ్నలు వేసేవారి స్వంతయింటిలోనో స్థలంలోనో, పొలంలోకి కొంతకాలం తిష్టవేసి ధౌర్జన్యంగా ఆక్రమించి యెవరైనా స్థిరపడితే

''వాడు దుర్మార్గుడు కనుక ఆక్రమించాడు. మనం సన్మార్గులం కదా! అని ఆ యింటిని, స్థలాన్ని వదిలేస్తారా? ఇంతకాలంగా వాడుదాన్ని ఆక్రమించి అనుభవిస్తున్నాడు. తిరిగియిమ్మనటం ధర్మం కాదంటూ వదిలేస్తారా?

**ఇలాంటి ప్రశ్నలు వేసే కంటే**

1. ఒక పాడుపడిన, శిధిలావస్థలోవున్న కొన్ని సంవత్సరాలుగా నమాజు యెరుగక, కనీసం ముస్లింల ప్రవేశానికయినా అవకాశం లేని వివాదాస్పద కట్టడాన్ని కూలద్రోస్తేనే యింత గోలజరుగుతుంది. మరి కాశ్మీర్లో అనుదినం పూజలు, ఉత్సవాలు జరిగే పచ్చని దేవాలయాలను (80 మందిరాలను) ధ్వంసం చేసి పూజారులను, ఇతరులను ఘోరంగా చంపినపుడెవరూ యింతగోల చేయలేదేమి? అని ప్రశించివుంటే సంతోషం.

2. ఎక్కడో అయోధ్యలో యెవరో కొందరు హిందువులు ఆ కట్టడాన్ని కూల్చివేశారని బంగ్లాదేశ్

మో॥ ముస్లిం దేశాల్లో ఏపాప మెరుగని హిందువులను వందలాది మందిని చంపి, ఎందరో స్త్రీలమానాలను మంటగలిపి, ఎన్నో ఆస్తులను దోచారు కదా!

" ఎక్కడో యెవరో తప్పు చేశారంటూ అమాయకులపై తమ కక్ష తీర్చుకోవటం మానవత్వమేనా?" అని ప్రశ్నించివుంటే సంతోషం.

3. ఒక శిథిల కట్టడాన్ని కూల్చినందుకు ప్రతీకారం అంటే వందలాది ప్రాణాలను, మానాలను నాశనం చేయటం సమంజసమా? వారికి కావాలంటే అలాంటి కట్టడాలను పది నిర్మించి యివ్వగలం. కానీ వారు తీసిన ప్రాణాల్లో ఒక్క ప్రాణాన్ని, చెరచిన మానాల్లో ఒక్క మానాన్ని తిరిగియివ్వగలరా?" అని ప్రశ్నించి వుంటే ఆనందం.

4. " ఎక్కడో బంగ్లాదేశ్, ముస్లిం దేశాల్లోనే కాదు, మనదేశంలో కూడా ఆకట్టడాన్ని కూల్చిన మరుసటి దినాలలో ఎన్నో కుహనాసెక్యులర్ మఠాలు అనేక హిందూ దేవాలయాలకు కీడుచేశారు. వారికి బుద్ధి జ్ఞానం వుందా?" అని ప్రశ్నిస్తే సంతోషం.

5. "వాస్తవాలను మరుగు పరచి, ధర్మాన్ని అధర్మంగా చిత్రించిన "రామ్ కె నామ్" అనే టి.వి. కార్యక్రమాన్ని, బంగ్లాదేశ్‌లో హిందువులపై జరిగిన అత్యాచారాలు, హత్యలు వివరించబడిన తస్లీమా గారి పుస్తకంతో పోల్చి వ్రాశాడొక (దొంగ) సమీక్షకుడు. అది సమంజసమేనా?" అని ప్రశ్నించి వుంటే సంతోషం.

ఇలా యెన్నో ఆలోచించదగిన, అడుగదగిన ప్రశ్నలుండగా అలాంటి చొప్పదంటు ప్రశ్నలు వేస్తున్నారీ ప్రజలు. ఏమైనా అంటే సెక్యులరిజం అంటారు. ఏది నిజమైన సెక్యులరిజం? సెక్యులరిజానికి యీ ప్రశ్నలు దగ్గరగావున్నాయా? లేక వారు వేసే ప్రశ్నలు దగ్గరగావున్నాయా? ఈ ప్రశ్నలు సెక్యులరిజానికి వ్యతిరేకమని యెవరయినా నిరూ పించగలరా?

ఈ వేదన అందరిలో కలగాలని ఆశతో వ్రాస్తున్నాను. – పి. రఘు, వడ్లమూరు

---

## మాస విశేషాలు

| శ్రావణం ( ఆగ.97) | భాద్రపదం (సెప్టెం.97) |
|---|---|
| 5. మంగళ గౌరి వ్రతం | 5. స్వామి రామతీర్థ జయన్తి, ఉపాధ్యాయదినోత్సవం. |
| | 6. వినాయకచవితి |
| | 8. గౌతమబుద్ధ జయంతి |
| 15. వరలక్ష్మీ వ్రతం - | 14. ఓనం |
| స్వాతంత్ర్య స్వర్ణోత్సవ దినం | 16. సంపూర్ణ చంద్రగ్రహణం |
| | 17. విశ్వకర్మ జయన్తి, మహాలయ పక్షప్రారంభం |
| 18. రక్షాబంధన్ | 19. ఉండ్రాళ్ళ తదియ |
| 25. శ్రీకృష్ణ జయంతి | 25. దీన దయాళ్ జి జయన్తి |
| 31. పుబ్బకార్తె | 27. భాయిపరమానంద బలిదానం |

# హైందవ పుణ్యక్షేత్రాలు

భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన పిమ్మట మొదటిగా జరిగిన సత్కార్యము సర్దార్ వల్లభభాయి పటేల్‌చే సోమనాథ దేవాలయ ప్రాంతమున పురాతన పవిత్ర జ్యోతిర్లింగ పునఃప్రతిష్ఠ. అక్కడ దుర్మార్గుడై అనేక వేల హైందవ దేవాలయములను నేలమట్టము చేసి మసీదులు కట్టించిన ఔరంగ జేబు చేకట్టించబడిన మసీదు అవసేషములను తొలగించి శ్రీసోమనాథ దేవాలయము నిర్మాణమయ్యెను.

ఆంధ్రప్రదేశ్ టైమ్సు అన్నే ఇంగ్లీషు దినపత్రిక యందు మెహమ్మదు వజీరుద్దీను కురుక్షేత్రమును గూర్చి వ్రాయుచు, అక్కడ కౌరవపాండవ సంగ్రామము, శ్రీ మద్భగవద్గీత ప్రభోదము జరిగినదే కాక అక్కడ ఇస్లాము, సిక్కులు చేత కూడ పవిత్రత పెరిగినదట. అక్కడ ఇరాన్ నుండి వచ్చిన షేక్ బెలి తపస్సు చేశాడట.

హైందవ దేవాలయములను రక్షించుకొనుట యందు తురుష్క పాలన యందేకాక స్వాతంత్ర్యానంతరము కూడ అచేతన హిందూ సమాజపు కర్మ సిద్ధాంతమే మన విఫలతకు కారణము. హిందూ దేవాలయములవద్ద పూలు, సరుకులు అమ్ముతురుష్కులు, మసీదు నిర్మిస్తారు. అది శ్రీశైలము వద్ద కూడా జరిగినధి. దేవాలయ ప్రాంతములందు హైదవేతరులను ప్రోత్సహము చేసెడి హిందువులు ప్రభుత్వాన్ని నిందించి ప్రయోజనమేమి?

తమని తాము రక్షించు కొనలేని వారు దేశమునేమి రక్షించగలరు. హైందవులు మిక్కుటముగా గల దేశమున 'ధర్మ నిరపేక్షత' ముసుగులో మత మార్పిడులు పెరిగిన విషయము లోకనిదితమే, తిరుమల తిరుపతి దేవస్థానము మొదలైన దేవాలయపు కమిటీలలో రాచకీయులు ప్రవేసించి పవిత్రత చెడకొట్టుటేకాక, దాతలు దేవునికై, ధర్మము పెంపొందుటకై ఇచ్చిన ధనము దేవాదాయశాఖ, ప్రభుత్త్వములచే ధర్మనిరపేక్ష పనులకై వినియోగింపబడుట చాలా హీనమైనపని. ధర్మము పెంచక అవినీతిని పెంచు రాజకీయులు, దేవాలయములను దోచుకున్న మొగలులు, యాత్రీకులను దోచుకొను బందిపోటులు ఒకటేకాని వేరుకాదు.

దీనికై హిందూ సమాజము చైతన్యవంతమై దేవాలయపు ప్రాంగణకు, నిధులు, అహైందవ వినియోగమును నిరోధించనిచో మాతృద్రోహము, దేశద్రోహము చేసిన వారగుదురు.

ప్రతి దేవాలయము నందు జరుగు మంచి చెడులను పత్రికలకు, ప్రభుత్వ అధికారులకు అక్షేపణలు తెలుపుచు, యువకుల సహకారముతో దేవాలయములను, ప్రాంగణ శుభ్రత, నిధుల దుర్వినియోగములను నిరోధించుచు, ప్రతి దేవాలయమునకు ధార్మిక ప్రగతికై కార్యక్రమములు నిత్య కళ్యాణము పచ్చతోరణముగా జరిపేందుకు కంకణ బుద్ధులు కాని పక్షమున రామలక్ష్మణులు, తానీషాకు డబ్బు చెల్లించినట్లు ప్రభుత్వాధికారులకు నజ్రానాలందజేయుట దేశద్రోహము కాదా అప్పటినుండి తానీషాలు రామభక్తులై ప్రతియేటా ముత్యాలతో రామునభిషేకించుదురు. కాని మన ప్రభుత్వము నిధులు దుర్వినియోగ పరచుచున్నది గదా.

– మిత్తింటి వెంకట్రావు.

# వివిధ ప్రదేశాలకు ఆదర్శప్రాయం సంకటమోచన్‌ధామ్ మహోత్సవం

''కాలక్రమంలో సంకటమోచన్ ధామ్ దేశ ప్రసిద్ధ క్షేత్రాలలో ఒకటిగా రూపొందు తుందని ఆశిస్తాను. ఇచ్చట జరుగుతున్న భారత మాత విగ్రహ ప్రతిష్ఠ దేశమందలి పెక్కు మందిరాలకు ఆదర్శప్రాయమవుతుందని భావిస్తాను'' అని విశ్వహిందూ పరిషత్ కార్యాధ్యక్షులు శ్రీ అశోక్ సింఘల్ సంకటమోచన్ ధామ్ మహోత్సవ సందర్భంగా జూన్ 14న తమ ఆశీఃప్రసంగంలో అన్నారు.

న్యూఢిల్లీ రామకృష్ణపురం ఆరవ సెక్టారులో ఉన్న సంకట మోచన్ హనుమాన్ మందిర ఆశ్రమం ఇప్పటికీ దేశదేశాలలో ఉన్న విశ్వహిందూ పరిషత్ కార్యకర్తలకు సుపరిచితం. అది పరిషత్ కేంద్ర కార్యాలయం ఉన్న స్థానం. ప్రాచీన సంకటమోచన హనుమాన్ మందిర స్థానమిది. ఇటీవల కాలంలో అది ఎంతగానో అభివృద్ధిచెంది పెక్కు దేశధర్మకార్యకలాపాలకు ఆదర్శప్రాయమయింది. వారణాసిలో అలనాడు భక్తతులసీదాస్ ఆరాధిస్తూ వచ్చిన సంకటమోచన్ హనుమాన్ విగ్రహప్రతిరూపం రెండేళ్ల క్రితమే విశేష ఉత్సవాల మధ్య ప్రతిష్ఠింపబడింది. వారణాసి విగ్రహాన్ని రూపొందించిన శిల్ప వంశీయులే ఈ ప్రతిరూపాన్ని కూడా రూపొందించారు. ఆలయంలో జరిగే నిత్య నైమిత్తిక కార్యకలాపాలు పెక్కు మందిరాలకు ప్రేరణదాయకంగా రూపొందుతున్నాయి. ఆశ్రమంలో సంత్‌నివాస్, గోసేవా కార్యకలాపాల కేంద్రకార్యలయం, వేదపాఠశాల, వైద్యశాల ఇత్యాదులనేకం ఇప్పటికే నడుస్తున్నాయి. ఇటీవలనే భారత మాత ఆరతి విశేష కార్యక్రమంగా ఆరంభమయింది. నగరంలోని మరి అనేక మందిరాలలో కూడా భారతమాత ఆరతి ఆరంభమైంది. పెక్కు సేవాబస్తీలలో (జగ్గీజొంపడీలు) సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న మందిరాలు నగరంలో అనేకం ఉన్నాయి.

ఇటీవలి మరో విశేషం ''శ్రీ సంకట మోచన్ ధామ్ మహాసమితి'' ఏర్పాటు. మందిర కార్యకలాపాలను, దైవభక్తిని, రాష్ట్రభక్తిని, సేవాచింతనను విస్తరించడం, ప్రజానీకాన్ని తోడుచేసుకుని, సమాజంలో విశిష్ట ధార్మిక, సాంస్కృతిక శక్తిని నిలపడం ఇత్యాదులు మహాసమితి సంకల్పాలలో కొన్ని. నగరంలోని పెక్కు దార్మిక సంస్థలు, మందిరసంస్థలను సహయోగి సంస్థలుగా చేసుకొని కార్యకలాపాలు ఆమోదింపబడుతున్నాయి.

మహాసమితికి - యుగపురుష్ స్వామి పరమానందజీ మహరాజ్, మహామండలేశ్వర్ స్వామి కైలాసానందజీ, శ్రీమత్ వైష్ణవ పీఠాధీశ్వరి శుభమూర్తి మాతాజీ, జైన సాధ్వి సాధనాజీ, సాధ్వి శ్రీ ఋతంభర ఇత్యాది ఎందరెందరో సాధు సంతులు, శ్రీ అశోక్ సింఘల్, శ్రీ గిరిరాజ్ కిశోర్‌జీ ప్రభృతి విశ్వహిందూ పరిషత్ నాయకులు, ఢిల్లీ రామలీల మహోత్సవ సమితి సభాపతి శ్రీ ప్రేమచంద్రమూర్తి వంటి స్థానిక ప్రముఖు లెందరెందరి తోనో సంరక్షక మండలి ఏర్పాటయింది. ప్రసిద్ధపౌరులు శ్రీ శ్యామలాల్‌జీ ఖురానా అధ్యక్షులుగాను, ఏకాత్మతా సంకీర్తన మండలి సంస్థాపకులు శ్రీ రఘు వీర శరణ్ స్నేహ కార్యాధ్యక్షలుగాను, సుప్రసిద్ధ ప్రవచనకారులు శ్రీ సోమన్ లాల్ రామసింగ్ ప్రధాన కార్యదర్శిగాను, నగరంలోని విభిన్న ప్రదేశాలకు చెందిన పెక్కుమంది కార్యదర్శులు గాను నియక్తులైనారు.

మహాసమితి తన ప్రప్రథమ కార్యక్రమంగా జూన్ 7 నుండి 16 వరకు - 9 రోజులపాటు ధార్మిక సాంస్కృతిక కార్యక్రమాలను, పలు విగ్రహముల ప్రతిష్ఠాపనంలతో మహోత్సవం నిర్వహించింది. ప్రతి

నిత్యము ప్రభాతభేరి, తులసీ రామాయణం నవాహ్న పారాయణ, నిత్యయజ్ఞము, రాత్రి 8 మొదలు 11 వరకు ప్రసిద్ధ రాసలీల నిర్వాహకులు శ్రీ రామస్వరూప్‌జీ ద్వారా జగత్ప్రసిద్ధ బృందావనమండలిచే రాసలీల భక్తి రసప్రధాన నృత్యగాన కథా ప్రదర్శన నిర్వహించబడినాయి. వేలాది స్థానిక ప్రజానీకం దర్శించి పులకించారు. నిత్యము జరిగిన యజ్ఞములలో శ్రీ గణపతి, శ్రీ నవగ్రహ, మహామృత్యుంజయ, శ్రీ హనుమాన్, శ్రీ సామవేదం, శ్రీదుర్గా సప్తశతి, శ్రీరామ, శ్రీకృష్ణగోపాల, శ్రీభారత మాత మహాయజ్ఞములు జరిగాయి. వివిధ దేవీదేవతల ప్రతిష్ఠలలో శ్రీ భారతమత ప్రతిష్ఠ, శ్రీ కల్కి అవతార ప్రతిష్ఠ విశేష గమన్హర్హములైనవి. నిత్యమునవాహ్న పారాయణ అనంతరము శ్రీమద్రామాయణ ఆరతి, శ్రీ భారతమాత ఆరతి జరిగాయి. రోజుకొక్కరు వంతున యజమానులుగా కార్యక్రమము నిర్వహించబడ్డాయి.

15వ తేదీన జరిగిన శోభాయాత్ర ( ఊరేగింపు) నగరంలోనే సంచలనం కల్గించిన విశేషం. నగరంలో పలు ప్రదేశాలనుండి, మందిరాలనుండి వచ్చిన పవిత్ర జలకలశాలను మహిళామణులు శిరస్సులపై ధరించి ముందుసాగారు. ఆ తర్వాత వివిధ దేవీదేవతల భారతమాత కల్కి అవతార చిత్రప్రతిమలతో గుర్రములతో గూడిన, అలంకృత రథములు - మధ్యన భజన సంకీర్తన బృందముల శకటములు సాగాయి. వేలాదిప్రజలతో, ఆ ప్రదేశమందలి పెక్కు పురముల ద్వారా సాగిన శోభాయాత్ర ఈ ప్రదేశమందే అపూర్వమని ప్రశంసింపబడింది. ఉద్యమ ముగింపులో భారీ ఎత్తున భండారా ప్రసాద భోజనములు జరిగింది.

కార్యకలాపముల నిర్వహణలో నగరంలోని పెక్కు సంస్థలు, ప్రముఖులు, బాలబాలికలు, యువతీయువకులు, విశ్వహిందూపరిషత్ మహిళా విభాగం, దుర్గావాహిని, బజ్రంగదళ్, మఠమందిర్ సేవా సంస్థాన్, ధర్మయాత్రా మహాసంఘ ప్రముఖులు, కార్యకర్తలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. వివిధ కార్యక్రమములలో శ్రీయుతులు శ్రీ అశోక్‌జీ సింఘెల్, ఆచార్య గిరిరాజ కిశోర్, విజయ రాజసింధియా, నగరమేయర్, పరిషత్ కార్యదర్శులు, మఠమందిర సేవా సంస్థాన మహామంత్రి శ్రీ తులసీరామ్‌జీ శర్మ, మఠమందిర్ విభాగ్ ప్రముఖ్ లక్ష్మీనారాయణ, స్థానిక ప్రముఖులు పలువురు పాల్గొన్నారు. ఈ మహోత్సవ యోజన, సంఘటన, నిర్వహణ జన సమీకరణ ఇత్యాదులన్నీ దేశమందలి విభిన్న ప్రదేశములకు ఆదర్శప్రాయం. అనుకరణీయం.

- "ధర్మప్రియ"

## జీవిత సభ్యులు

**Madireddy Narasimha Rao**
S/o. Sri Bangaram
Laxmi Varapu peta
Rajahmundry, E. Godavari - 533 101.

**Grandhi Krishna Murthy**
23-1/3-3, Devatha Vari Street,
Ongole, Prakasham - 1.

**Malladi, Babu Prasad**
24-21-8, Ashramam St.
Durgapuram, Vijayawada,
Krishna - 3

**Kumar**
Veera Bhadra Electrical Engg.
Automobiles,
Main Road, Pitlam,
Nizambad - 503 310.

## విదేశీ ఉత్పత్తులు బహిష్కరించండి -
## ఆర్థిక దురాక్రమణనుఅరికట్టండి

| ఉత్పత్తులు | ప్రోత్సహించవలసినవి | బహిష్కరించవలసినవి |
|---|---|---|
| స్నానం సబ్బులు | నిర్మా, నీమ్, మార్గో, స్వస్తిక్, కుటీర్, చంద్రికా కెవికె, మైసూర్ శాండల్, అఫ్షన్ - ఇతర కుటీర ఉత్పత్తులు. గోద్రెజ్ - గంగా, సింధాల్, సంతూర్ | హిందుస్తాన్‌లీవర్ ఉత్పత్తులు (లక్స్, లిరిల్, పియర్స్, లైఫ్‌బాయ్ వగైరా) పాండ్స్, పామోలివ్, జాన్సన్ అండ్ జాన్సన్, క్లియర్సిల్, డెట్టాల్, వికో, టామ్కో, హెచ్ఎల్ఎల్(హమామ్, జాస్మిన్, మోతీ, జయ్, ఒ.కె.) - ప్రోక్టర్ అండ్ గేంబుల్, మార్వల్, విజిల్, గోల్డ్‌మిస్ట్) |
| కొబ్బరినూనె | అశ్వినీ హెయిర్ అయిల్, ఈటా, | క్లినిక్ ప్లస్ డాబర్ |
| బట్టలసబ్బులు | స్వస్తిక్, సాసా, ఆధునిక్, నిర్మా, ఈటా | హిందుస్తాన్ లివర్ (సన్‌లైట్, రిన్, వీల్) |
| డిటర్జెంట్లు | సూపర్‌చెక్ తదితర లఘు కుటీర ఉత్పత్తులు డిటర్జంటు పౌడరు-విమల్, హిపోలిన్, అమర్ నిర్మా | ఏరియల్, చెక్, గోద్రేజ్, పి అండ్ జి |

---

## బాలి (ద్వీపం)లో మహావిష్ణు విగ్రహం

140 మీటర్ల ఎత్తున శ్రీమహావిష్ణు విగ్రహం బాలిలో ప్రతిష్టకానున్నది. (జకార్తాపోస్ట్)

''గరుడ విష్ణు కెన్‌కణ'' అనే యీ విగ్రహం న్యూయార్క్‌లోని 'లిబర్టీ', ఇటలీలోని 'లీనింగ్ టవర్'లకు దీటుగా యాత్రికులకు ఆకర్షణీయంగా ఉంటుందని విగ్రహం నిర్మిస్తున్న శ్రీ న్యూమెన్ నేర్‌ట అన్నారు.

అంతేగాక ఇండోనేషియా జాతీయ చిహ్నము 'గరుడ' అయినందున గరుడ వాహన రూఢుడైన విష్ణు విగ్రహం ప్రపంచానికే రక్షనే గలదుట.

''అది గొప్ప శిల్ప కళా, సాంకేతిక శిఖరం, వ్యాపార విలువలు'' కలిగినదని ఆ పత్రిక వ్రాసింది.

ఆ విష్ణు విగ్రహం బాలికి 12 కి.మీ. దూరంలోగల కొండశిఖరంపై నిర్మించబడుతుంది.

జావా ద్వీపంలోని బాండుంగ్‌లో ముందుగా భాగాలు తయారుచేయబడి తూర్పుదిక్కున 900 కి.మీ. దూరంలో గలబాలికినౌ కలలో తరలించబడును.

విష్ణుమూర్తి శిరస్సు దాదాపు పూర్తి కాబడ్డది.

1990లో బాలి ప్రజలు విగ్రహ నిర్మాణాన్ని నిరోధించగా అపుడు ఆపబడి ప్రస్తుతం కొనసాగుతున్నది.

(మీ.పో)

# జగన్నాటకం

స్వామిదయానంద, శ్రీవ్యాసా శ్రమము, ఏర్పేడు.

''శ్రీకృష్ణ'' పరమాత్మనిగురించి ప్రతి ఆదివారం టి.వి.లో చూస్తుంటే, భగవల్లీల, మాయా నాటకంతో పాటు దేశ, ధర్మరక్షణ కొరకు పాండవులను వాడుకున్నట్లుగా ప్రస్తుతం అయోధ్య, మధుర, కాశీ మందిరాలను సాకుగా ''ధర్మా సంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే'' అని చెప్పినట్లుగా సంఘ పరివార్ సంస్థ ( ఆర్. ఎస్. ఎస్)ల రూపంలో (రాజకీయ, ఆధ్యాత్మిక, సాంఘిక, సేవారంగాలలో) కార్యకర్తలను పాండవులలాగా వాడుకుంటున్నారా అని అనిపించుతుంది. కాబట్టి ముఖ్యంగా యువకులు, గృహస్థులు, మహాత్ముల ఆధ్యాత్మిక బలంతో (శ్రీకృష్ణుని బలం) తమ క్షాత్రబలం (అర్జునుని బలం) జతపర్చి దేశ, ధర్మదక్షాదీక్షపూని భగవానునికి ప్రీతి పాత్రులుకావాలి. ఇందుకు పాండవులను గుర్తుచేసుకుంటూ సహనంతో, ఓర్పుతో, బాధలను తట్టుకుంటూ ముందుకు సాగాలి. మధ్య మధ్యలో శకుని, ధుర్యోధనుడు దుశ్శాసనుడు, కర్ణుడు మొ॥వారు ఆటంకాలు కలిగించినప్పటికీ, వారు కూడా భగవల్లీలా నాటకంలో వారిపాత్ర వారు నిర్వహించుచున్నారని తలచి, మనం నమ్మినధర్మాన్ని రక్షించుకొనుటకు ఎందుకైనా సిద్ధపడాలి. ఇందుకు పవిత్రహృదయం, భగవన్నామస్మరణ ముఖ్యం. పెద్దలు ఒకవేళ నీతిలో రాజనీతిని, మేళవించినా దాని వెనుక ఆదర్శపరమైన ప్రయోజనమే వుంటుంది. ధర్మ రక్షణే వాళ్ళ రాజకియాలకు పరమార్థం అయివుటుందని విశ్వసించినడుచుకోవాలి.

శ్రీకాశీ విశ్వేశ్వరాలయంలో రక్షణ కొరకు పోలీసులను ప్రభుత్వం నియమించితే, వాళ్ళ భక్తి, వాళ్ళు దేవుని ప్రసాదం కొరకు పడేపాట్లు చూస్తుంటే, రక్షణ సాకుతో వాటిని దగ్గర వుంచుకొని, వారి హృదయాలలో వున్న దైవభక్తిని చైతన్యవంత చేసి ఆయన (భగవంతుడు) పని (మందిర నిర్మాణం) వారి ద్వారా కూడా చేయించుకొనేందుకా అని అన్పించుతుంది.

ఇంకొక మాయానాటకం చూశారా. ఆ మధ్య టి.వీ.లో రామాయణం చూపించి. భక్తులలో వున్న చైతన్యాన్ని మేల్కొల్పి తనపని (శ్రీ రామజన్మభూమి) చేయించుకున్నారు. యిపుడు టి.వీ.లో ''శ్రీకృష్ణ'' సీరియల్ చూపించుతున్నాడు మరివపు శ్రీకృష్ణ జన్మభూమి విముక్తి. ముహూర్తం ఎపుడో ఆయనకే తెలియాలి మన పురుష ప్రయత్నం (పౌరుషం మీద పరమాత్మకి నమ్మకం లేదుగా, అందుకే అర్జునుని నిమిత్తంగా మనందరికీ ''క్షుద్రం హృదయ దౌర్బల్యంత్యక్త్వోత్తిష్ఠ పరంతప'' యిక్కడ ఒక సూక్ష్మమైన విషయం గుర్తుంచుకోవాలి. ప్రతిదారి (మతం) చేరుకునేది. ఒకే చోటుకి ( ఒకే పరమాత్మ దగ్గరికి) అని స్వానుభవంతో శ్రీ పరమహంసలవారు మనకు చెప్పివున్నారు.

కాని మనం వెళ్ళు దారికి అడ్డువచ్చిన వాళ్ళని తొలగించుకోవాలి సుమా!

మనకు మన తల్లి లాగానే, అందరి తల్లులు వందనీయులే. కాని మన తల్లికి బాధకలిగించిన వారిని, మనకు బలం లేనపుడు నపుంసకునిగా వుండిపోయినా. బలం తెచ్చుకొని తల్లి బాధని తొలగించలేకుంటే మానవ జన్మ వచ్చ వ్యర్థమైపోతుంది.

# ఆంధ్రకేసరి

(గతసంచిక తరువాయి - 10)

రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి

ఆంగ్ల దేశంబున నలయెడింబ రోయందు, ''ఎం.ఏ.''ను చదివినయిత్తబలుడు
రాజమహేంద్ర వరస్థసర్కార్ ప్రశి, క్షణ కళాశాలనాచార్య వరుడు
బందరు జాతీయ పాఠశాలాంతరా, ధ్యాపక వృత్తిని దాల్చినతడు
కాంగ్రెసు సంస్థకు కార్యదర్శిగనుండి, దేశంబుఁదిర్గినదేశికుండు
మాతృదేశ సేవ మంత్రమ్మై పనిచేయ, తనుమనోధనముల ధారవోసె
దానిఫలితమనగ దాపురించెను చేటు, రాజయక్ష్మ సోకిరాలిపోయె!

చీరాలప్రజలతో శ్రీయాంధ్రరత్నతో, నైక్య భావంబది యమ రేఁదనకు
వారికోర్కెలు జూడ వాస్తవంబుగఁ దోచెఁ, దనసొను భూతియుఁదక్కెఁదమకు
అటువంటి కష్టముల్ అడ్డుకొనంగను, నార్థిక సహకారమవసరంబు
తనయొద్ద బాంకులోధనము మూలుగు చుంట, ధారాళముగఁదానుధనమొసెంగె
ఆయుదంతము మఱి యా విజయంబును, ప్రథితమయ్యె సర్వభారతమున
ఆంధ్రరత్నుఁ దలచి యాంధ్రకేసరి తాను, మిగుల పులకరంచు మేను మఱచు

దక్షిణగంగనాఁదద్దయునొప్పెడు, గోదావరీ తల్లి క్రుద్ధ యయ్యె
ఉత్తాలమైపొంగి యురవళ్ళు వోవు చుఁబరవళ్ళు ద్రొక్కెను వరద ముంపు
అచటి డెల్టా యందు నలజడి చెలరేగి, వడతుఫాన్ దెబ్బకు వడవడంకె
జీవ జాతంబులు చిన్న భిన్నములయ్యె, నరకోటి ప్రాణముల్ నలిగిపోయె
అట్టి వరద తుఫాన్లవి, యనుభవములె, కాని యెప్పటి కప్పుడు కనగఁ గ్రొత్త
'' ఈతుఫానును వర్ణింప నేఱితరము?'' అను విధంబుగ ననిపించు ననవరతము!

పందొమ్మిదొందల పైననిర్వది మూడు, వత్సరంబదియప్డు వరలు చుండె
వరదలప్పుడె వచ్చె-వరద బాధితులకు, జరుగు చుండె సహాయ చర్యలపుడు
అలకాకినాడలో నప్డె కాంగ్రెసు సభల్, జరుప యత్నములవి జరుగుచుండె
ఒకవంక దానికి నొకవంక దీనికి; సదరు విరాళముల్ సాగుచుండె
బులుసు సాంబమూర్తి భుజముల యందున, మొత్తమివియ రెండు మోపబడియె
అతడు నిర్వహించె సద్భుతాద్భుతముగ, తెలుగు తల్లి ''కామధేను'' వనగ!

సాంబమూర్తి మహర్షి 'సాధకుడాతడు, జననమరణ రహస్యజ్ఞుడుహహ!
ఏకైక పుత్రుడు, ఇర్వదేడుల వాడు, కన్నుమూసిన గాని కలత వడడు
పుట్టెడు దుఃఖాన పూడుకు పోయుయు, పూనుకొన్నపనిని పూర్తి చేసె
కాంగ్రెసు సభలకు కావలసిన యట్టి, వనరులనన్నియు వశము గొనియె
తొలుతనాతడు లాయరు తుదకు పేద, శ్రీ ప్రకాశము వోలెను వృత్తి వదలె
దేశసేవకు దూకిన దివ్యసూరి, యాంధ్రకేసరి కతడన్న యమిత గురియ!

అదిడిసెంబరు నెల యలకాకినాడలో, జరిగెడు కాంగ్రెసు సభల యందు
విష్ణుదిగంబర విమలనామాంకుడు, పండిత పలుసుకర్, పైకినెక్కి
బంకిము చంద్రుని వందె మాతరమను ప్రాణగీతమ్మును పాడుచుండ
అధ్యక్షుడైనట్టి యామహ్మదాలీతా, నభ్యంతరముఁ జెప్పెనతడు పాడె
అలిగి వెడలెను మహమదు యచటినుండి, రభస జరిగెను మఱికొంత, సభలయందు
అట్టి వారలు రాష్ట్రీయులనుట దగునె? యనెడు ప్రశ్నంబు నేటికి నట్లనిలిచె!

# గాయత్రీ మంత్రము - సర్వమత సమ్మతమా ?

1990 జనవరిలో మద్రాసులోని, ఓరియంటల్ ఇన్స్యూరెన్స్ మేనేజింగ్ డైరక్టరు లేకడివిజనల్ మేనేజరు గ్రీటింగ్ కార్డులు మీద గాయత్రీ మంత్రాన్ని ముద్రింపచేసి పంచి పెట్టటం జరిగింది. దానిమీద కొంతమంది సెక్యులర్ వాదులు (తామే అసలైన సెక్యులర్ భావాలు కలవాళ్ళమని తలంచి ఎవరైనా సెక్యులర్‌గా లేరని అనిపిస్తే అటువంటి వారిమీద విరుచుకుపడడం అలవాటుగా ఉండేవారు) ఒక ప్రభుత్వ సంస్థ ఈ సెక్యులర్ దేశంలో గ్రీటింగ్ కార్డులమీద గాయత్రీమంత్రం వేయించి పంచి పెట్టడం సెక్యులరిజానికి విరుద్ధమని అటువంటి పనిచేసిన అధికారి మీద చర్య తీసుకోవాలని, కోర్టులో దావా వెయ్యటం జరిగింది. ఆదావా 1993లో యిరుపక్షాల న్యాయవాదుల వాదోపవాదాల తర్వాత 1993లో తీర్పుకు వచ్చింది.

మాననీయ శ్రీ సాలమన్‌రాజు అనే జడ్జిగారు యిరుపక్షాల వాదోపవాదాలు విన్న తర్వాత, మంత్రంలోనూ, మంత్రార్థంలోనూ, సెక్యూలరిజానికి, సంబంధించిన అభ్యంతరాలు ఏమీలేవని, ఏ మతానికి చెందిన వారైనా సరే గాయత్రీ మంత్రాన్ని పఠించవచ్చునని తీర్పు యివ్వటం జరిగింది.

యింతకీ ఆ గాయత్రీ మంత్రం, ఏమిటో ఒకసారి చూద్దాం.

( ఇది ఈశ్వర ఉపాసనావిషయము)

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్

భావార్థము – హేరక్షక, సచ్చిదానందస్వరూపా, పరమాత్మ, సకల జగత్తునూ సృష్టించు, సమస్త విశ్వమునూ ప్రకాశింపజేయు నీయొక్క ప్రసిద్ధము, సర్వ ఉత్కృష్టమును అగు విజ్ఞాన స్వరూపమును మేము ధ్యానింతుము. మాకు సద్బుద్ధినిచ్చి, మేము సత్కర్మలు ఆచరించునట్లు అనుగ్రహింపుము.

ఈమంత్రాన్ని అర్థాన్ని ఏకులము, ఏమతము, ఏజాతి, ఏలింగము వారైననూ చిన్నా, పెద్దా తేడా లేకుండా ఎల్లప్పుడూ స్మరించవచ్చని పెద్దలు వాక్రుచ్చుచున్నారు.

సేకరణ – మామిడి సుబ్బారాయుడు.

---

## ఉత్తరఅమెరికాలో 1997 భారత స్వాతంత్ర్యోత్సవ సంవత్సరం.

హైందవ సంస్కృతి, వారసత్వము అభివృద్ధికై 'హిందూ విద్యార్థి కౌన్సిల్' (సంస్థ) వారు భారత 50వ స్వాంతంత్ర్యోత్సవము 1997వ సంవత్సరమంతా అనేకకార్యక్రమాల రూపంలో ఉత్తర అమెరికాలో జరప నిశ్చయించినారు.

'భారత దర్శన్' పేరిట భారతీయ (హైందవ) నాగరికత ప్రపంచవ్యాప్తంగా విలాసనాతనమో, సజీవమో ప్రదర్శనలు, వివిధ ప్రచార సాధనాల ద్వారా ప్రదర్శింపనున్నారు.

విదేశీదాడులు, ఆక్రమణలు ఎదుర్కొని భారతీయులు వారి సంస్కృతి ఎలా కాపాడుకొన్నది. బానిసత్వాన్ని సహించి, ధైర్యంగా స్వాతంత్ర్యాన్ని ఎలా సాధించినది ప్రదర్శనలలో ఉంటాయి.

14, ఆగష్టు-1997 అర్ధరాత్రి 'భారతమాతకు వందనం' ప్రపంచవ్యాపంతంగా నిర్వహింపనున్నారు.

(మీ.ఫో.)

# వార్త

## ''ఆంధ్రపైనా ఐ.ఎస్.ఐ కన్ను - ఇంటలిజెన్స్ నివేదిక - దేశవ్యాప్తంగా రెడ్ అలర్ట్''

అన్న వార్త ప్రముఖంగా మొదటి పేజీలో పెద్ద పెద్ద అక్షరాలలో 10.7.97న ఈనాడు దిన పత్రికలో ప్రచురితమైంది. ఈశాన్యరాష్ట్రాలు, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ మరియు ఉత్తర ప్రదేశ్‌లలో తనకార్యకలాపాల్ని ఐ. ఎస్. ఐ ఉధృతం చేయాలని ధృవించే వార్తలు వచ్చాయని ఈ పత్రిక వ్రాసింది. దానిపై కేంద్ర హోంశాఖ దేశవ్యాప్తంగా రెడ్ అలర్ట్ జారీ చేసినారని విశ్వసనీయ వర్గాలు తెలిపాయి.

12.7.97నాటి దక్కన్ క్రానికల్‌లో ఐ. ఎస్. ఐ ఆంధ్రప్రదేశ్‌లో కదలికలు అని ప్రముఖంగా ప్రచురించి, శ్రీ ఎమ్ ఆర్.పి సింగ్ సిటీ పోలీసు కమీషనర్‌గా పదవిని చేపట్టిన రోజుననే ఈ వార్తను తెలియచేసినారు. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా హైదరాబాదు నగరంపై ఐ.ఎస్.ఐ. దృష్టి కేంద్రీకరించిందని రెడ్ అలర్ట్ ప్రకటనానంతరం కావలసిన చర్యలు తీసుకొంటున్నామని శ్రీ సింగ్ తెలియచేసారు. గోపనీయంగా దానికి కారకులైన వారిపై నిఘాచర్యలు చేపట్టినామని శాంతిని భంగపరిచే వ్యక్తులపై, శక్తులపై తీవ్రమైన చర్యలు తీసుకొంటామని పైవార్తలో ప్రకటించారు.

కాని దానికి వ్యతిరేకంగా పై సింగ్‌గారే 14.7.97న తెలంగాణా వర్కింగ్ జర్నలిస్ట్ యూనియన్ మీట్‌ద ప్రెస్‌లో పాకిస్తాన్ గూఢచారి సంస్థ ఐ ఎస్ ఐ కార్యకలాపాలు నగరంలో కొనసాగుతున్నట్లు వస్తున్న వార్తల్లో నిజం లేదని, శాంతి భద్రతలు పటిష్టంగా లేని నగరాల్లో మాత్రమే ఈ ఏజెంట్లు ప్రవేశించి తమ కార్యకలాపాల్ని కొనసాగిస్తున్నారని సెలవిచ్చినారు. హైద్రాబాదునగరంలో వారి కార్యకలాపాలు కొనసాగే పరిస్థితి లేదని భవిష్యత్తులో ఉత్పన్నం కాదని ఆయన ధృడ వైఖరితో చెప్పినారు. టాడా చట్టవల్ల చాలామందిని అరెస్టుచేసినామని శాంతి భద్రతలకు అవి ఎంతో వుపయోగకారిగా వుందని తెలిపినారు.

పోలీసు వారి మాటలు వాగ్దానాలు చర్యలు ఎంతవరకు నమ్మవచ్చునో అర్థంకావటంలేదు గత ఆరునెలలక్రితం రాష్ట్రరాజధానిని ఒక వూపు ఊపిన పాఠశాల బాలుర కిడ్నాపింగ్ వార్తలు గుర్తు తెచ్చుకొంటే ఈ పోలీసు వ్యవస్థ ఎంత ఆధారపడ్డతగ్గదో అందరికి తెలుస్తుంది. స్కూలు పిల్లలు మాయమవుతుంటే పోలీసులు కనీసం కంప్లైంటు రికార్డు చేసుకొనుటకు కూడా తిరస్కరించిన విషయం ఎవరు మరువగలరు? కళ్లముందు జరుగుతున్న విషయాన్ని కాదనగల సమర్థులు ఈ పోలీసువారు. మరి అంతర్జాతీయ లెవెల్‌లో కుట్ర జరుగుచున్నదీ అని అనేక వార్తలు అన్ని పత్రికలలో వస్తూ వుంటే ఏమిలేదు ఏమికాదు అని కబుర్లు చెప్పే అలవాటున్న ఈ ఖాకీ బట్టలవారిని నమ్మేదెట్ల నిశ్చింతగా వుండేదెట్లా?

– ప్రమోద్ వల్‌సంగ్‌కర్

---

''మనల్ని మనం ద్వేషించుకోకుండా వుండటమే మన ప్రథమధర్మం. ఎందుకంటె అభివృద్ధి పొందడానికి మొదట మనలోను తరువాత భగవంతునిలోను విశ్వాసాన్ని కలిగి వుండాలి. ఆత్మ విశ్వాసంలేని వ్యక్తికి భగవంతునిలో విశ్వాసం కలగటం కలలోని మాట.''

– శ్రీస్వామి వివేకానంద.

సేకరణ : చేరెడ్డి శ్రీరామ్‌రెడ్డి.

# బంజారచరిత్ర

(గతసంచిక తరువాయి)

అలాగే 17 రాష్ట్రాలలో వారు బంజారాలు వ్యాపించి యున్నారని రిపోర్టు సూచిస్తున్నది. అవి ఏవనగా (1) ఆంధ్రప్రదేశ్ (2) తమిళనాడు (3) కర్ణాటక (4) మహారాష్ట్ర (5) కేరళ (6) బీహార్ (7) ఒరిస్సా (8) గుజరాత్ (9) రాజస్థాన్ (10) హిమాచల్ ప్రదేశ్ (11) ఢిల్లీ ప్రదేశ్ (12) పశ్చిమబెంగాల్ (13) త్రిపుర (14) పంజాబ్ (15) హర్యానా (16) మధ్యప్రదేశ్ మరియు ఉత్తరప్రదేశ్.

పై విషయాలను బట్టి బంజారాల మీది పరిశోధన ఎంత కష్టతరమైనదో అర్థము చేసుకొనవచ్చు. కనిత్కర్ అనే చరిత్ర పరిశోధకుడు దొరికిన వివరాలనుబట్టి ఉత్తర దక్షిణ భారతాలలో లంబాడీలు చరించిన మార్గాన్ని అన్వేషించాడు. ఆయన ఆప్రాంతాలకు బంజారాలకు వ్యాపార శ్రేణులరీత్యా పెట్టుకొన్న పేర్లుయుండేవి. దీన్ని బట్టి పరాక్రమం నిర్భయత్వం స్వతంత్ర దృష్టి ఉన్న నిరంతర సంచార జీవనులే బంజారాలు. ఎక్కువగా భూసంచారము వాణిజ్యం కోసము ఎద్దులు (బలద్) వాడుక గోనెసంచుల తయారీ (గోణి) గోణిల తయారి బంజారాలకు ప్రత్యేకమైన చారిత్రక చిహ్నముగా చెప్పవచ్చును. దశకుమార చరిత్రలో బంజారాలు ఎద్దులను బాడుగలకు ఇస్తూ ఉండినట్లు రికార్డయింది.

ఫ్రెంచ్ యాత్రికుడైన అబ్బెడు బోయిస్ తన పరిశోధనలో 17వ శతాబ్దములో ఇలా శ్రేణులుగా సాగే వాణిజ్య సమూహాలను చూశారట. వాటికి టాండో అనేపేరు ఉండేదట వందల కొలది ఎద్దులు వేలకొద్ది ధాన్యపు మూటలు దానిచుట్టూ వేటకుక్కలు పహరా నడుమ నాయకుడు, డేరాలను అతను గమనించాడు. కాలక్రమంలో అటు తెలంగాణాలోనూ ఇటు ఆంధ్రలోనూ, బంజారాలు పాక్షిక స్థిరజీవనానికి అలవాటు పడిన తాండా అనేపేరు సుగాలిగ్రామానికి పర్యాయ వాచకమైనది. తాండాను నడిపేనాయకుడు ఊరిపెద్దగా మిగిలినాడు. ధాన్యపు బస్తాల చుట్టూ కాపల ఉన్న కుక్కలు ఈనాటికి ఇండ్లముందు సంస్కృతిలో భాగంగా మిగిలిపోయింది. అందుకే ఎవరైనా కొత్త మనిషి తాండాలోనికి వస్తే ఎవరీ ఊరికుక్క ఇక్కడికి ఎందుకువచ్చాడు? (కూణీగా మేర్ కొత్రా కసేన ఆయా చె) అంటే తాండా మామూలు గ్రామముకాదని, వారికుక్కలు వేటకుక్కలు మాత్రమే తప్ప ఊరికుక్కలు కావని అర్థము. టిప్పుసుల్తాన్ కాలంలో ధాన్యపు గింజలు సుగంధ ద్రవ్యాలు మొదైలన వాటిని చేరవేసే వ్యాపారులుగా బయలుదేరి యుద్ధానంతరం మరలా ఉత్తర దేశంవైపు వెనుదిరిగి పోకుండా అటు తెలంగాణా ఇటు రాయలసీమ నడుమ, తూర్పు దిశగా మధ్య ఆంధ్రలోవ్యాపించినారు. తమిళనాడు కర్ణాటకలకు వ్యాపించిన సమయంలోనే దాదాపు 200సం॥ల క్రితం బంజారాలు అడవులలో కొండ చరియలలో నివశించడం మొదలు పెట్టారు. వీరెైనంత వరకు బంజారేతలతో (Kor) సంపర్కం లేక యుండుట వీరి ప్రత్యేకత 'గోర్' అను పేరుతోనే తమను తాము పిలుచుకొంటారు. తాండా సంస్కృతిని కార్యవర్గ వ్యవస్థను పంచాయితీ పద్ధతిని చాలా వరకు అలాగే నిలుపుకొన్న విశిష్ఠ చరిత్ర బంజారాలది.

మహమ్మదీయులు ఆంగ్లేయుల పరిపాలనలో స్వతంత్రదృష్టి కలిగి ప్రభుత్వాలను ఎదిరించిన వీరిని ఆప్రభుత్వాలు చిన్న చూపుతో నేరస్తులుగా (క్రిమినల్‌ట్రైబ్స్) గా గుర్తింపు ఇవ్వడం సత్యదూరం కాదేమో! (లేదా) పరిస్థితుల ప్రాబల్యం వల్ల కొంతకాలము దారిదోపిడీలు, దొంగతనాలకు బలియైన వీరు నేరప్రవృత్తి గల ఆటవికులు మాత్రం కారు.

కర్ణాటకలో సేవాభాయ వంటి మహావీరుడు పుట్టిన రాచరికపు సంస్కృతి వారిది. పంచాయితీలలో వీరిసంబోధన ''పచారిలాక్ ఆన్‌పచారి సవాలాక్'' అనేది నిరూపణ. కొన్ని సంస్థానాలు బంజారాల పాలనలో ఉండేదని బంజారా 'స్టడీ టీమ్' గుర్తించింది. ఈనాడు అన్ని అంతస్తులలోనూ, బంజారవ్యక్తులున్నారు. పటిష్ఠమైన దాంపత్య వ్యవస్థర అత్యంత శాతము మనోబలం, (I.Q), గౌరవప్రద జీవితభావన జాతి పవిత్రత వైపులక్ష్యం (జాంగడ్ వ్యవస్థ), ఉదారభావం, సమరస జీవనదృష్టి, ఉన్న బంజారాలు జాతి సమైక్యతను కాపాడిన ఉత్తమ పౌరులు.

ఈ వ్యాసంలో బంజారాల సంస్కృతి సాహిత్యం, మొదలైన అంశాలపై చర్చించడానికి నేపద్యంగా, ఈచరిత్రను వ్రాశాను. గతాని బట్టి కీర్తిని, వర్తమానాన్ని బట్టి స్థితిని, భవిష్యత్‌ను బట్టి వృద్ధిని, సాధించడం మానవుడి ధర్మం. బంజారాలు మేల్కోవటానికి తమను తాము గుర్తించడానికి, బంజారాల సామాజిక జీవనచరిత్రను మిగతావారు తెలుసుకొనటానికి ఈ వ్యాసం ఉపకరించగలదు.

సేకరణ:- బి.కె.సత్యం, పుంగనూరు

# బసవయ్య సేవకు

– మంజీరా

కడుపునిండ తినవయ్యా బసవయ్యా
నీవు తింటేనే మా కడుపు నిండేనయ్యా
మా పొలాలలో పసిడి పంట పండేనయ్యా ॥ కడుపు॥

శివుని వాహనమయ్యిన నీవూ
సింత ఇంతెందుకు చేసేవూ
సినబోయి ఎందుకు ఉన్నావూ
అయ్యో పాపం నోరిప్పి సెప్పలేవూ ॥కడుపు॥

అలనాటినుండి మా కన్న ధాన్యాలూ
అందించినావు నీవు పాడి పంటల్లు
కట్టుకొన్న మా బట్టలలో దాగి వున్న దీ
నీ కష్టం అని మరచిన మూఢులమూ, మూర్ఖులమూ ॥ కడుపు॥

తల్లివి తండ్రివి నీవని మరచిన వారలమూ
నీతల నరకగ అల్ కబీర్లు తెరిచిన వారలమూ
మా పాపం పామై మమ్మే కాటేసినా
మత్తు వదలని పరమమంద బుద్ధులం మేము ॥కడుపు॥

యంత్రాలు ఎన్నున్నా అవి నీకు సరిరావు
నీవు లేక మనుషులకు పుట్ట గతులే లేవు
మా తప్పులు మన్నించి దయ జూడ వయ్యా
లోకులను నీ సేవకు మరలించెదమయ్యా ॥ కడుపు॥

# ప్రాచీన చారిత్రక ప్రాంతాలు - వాటి స్థానాలు

| | ప్రదేశం | విస్తరణ | రాష్ట్రం |
|---|---|---|---|
| 1) | అవంతి | పశ్చిమ మాల్వా | మధ్యప్రదేశ్ |
| 2) | అనూప | నర్మదానదీ పరీవాహ ప్రాంతం | మధ్యప్రదేశ్ |
| 3) | దశార్ణదేశం | ఛత్తీస్‌ఘడ్, విదిశ జిల్లాలు | మధ్యప్రదేశ్ |
| 4) | ఛేది | బుందేల్ ఖండ్ | మధ్యప్రదేశ్ |
| 5) | కోసల | అయోధ్య, పరిసర ప్రాంతాలు | ఉత్తరప్రదేశ్ |
| 6) | పాంచాల | బరేలీ, బడౌన్, ఫరూకాబాద్ ప్రాంతాలు | ఉత్తరప్రదేశ్ |
| 7) | ప్రస్థ | అలహాబాద్ ప్రాంతం | ఉత్తరప్రదేశ్ |
| 8) | వత్స | యమున దక్షిణాన ఉండే ప్రాంతం | ఉత్తరప్రదేశ్ |
| 9) | మల్ల | గోరఖ్‌పూర్ జిల్లా | ఉత్తరప్రదేశ్ |
| 10) | కాల్సి | డెహ్రాడూన్ జిల్లా | ఉత్తరప్రదేశ్ |
| 11) | మగధ | పాట్నా, గయజిల్లాలు | బీహార్ |
| 12) | అంగ | భగల్ పూర్ ప్రాంతం | బీహార్ |
| 13) | విదేహ | ముజఫర్ పూర్ జిల్లా | బీహార్ |
| 14) | విరాట | జైపూర్ జిల్లా | రాజస్థాన్ |
| 15) | మత్స్య | జైపూర్, పరిసరప్రాంతం | రాజస్థాన్ |
| 16) | కురురాజ్యం | ఢిల్లీ, కేంద్రంగా హర్యానా U P భాగాలు | ఢిల్లీ,హర్యానా, ఉత్తరప్రదేశ్ |
| 17) | కళింగ | ఒరిస్సా, ఉత్తరాంధ్ర జిల్లాలు | ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ |
| 18) | మహాకాంతారం | ఒరిస్సా రాష్ట్రం | ఒరిస్సా |
| 19) | అష్మక | ఔరంగాబాద్, నాసిక్ జిల్లాలు | మహారాష్ట్ర |
| 20) | పైఠాన్ | నాసిక్, పరిసర ప్రాంతం | మహారాష్ట్ర |
| 21) | అపరాంత | ఉత్తరకొంకణ్, కెనరా, బొంబాయి ప్రాంతాలు | కర్ణాటక, గోవా, మహారాష్ట్ర |
| 22) | లాట | దక్షిణ గుజరాత్ | గుజరాత్ |
| 23) | గిరినార్ | కథియవార్ | గుజరాత్ |
| 24) | వైజయంత | మైసూర్ ప్రాంతం | కర్ణాటక |
| 25) | వంగ | బెంగాల్ మొత్తం | పశ్చిమ బెంగాల్ |
| 26) | గౌడ దేశం | మధ్యబెంగాల్ | పశ్చిమ బెంగాల్ |
| 27) | సతీదేశం/కాశ్యపదేశం | కాశ్మీర్ | జమ్ము & కాశ్మీర్ |
| 28) | కామరూప | అస్సామ్ మొత్తం ప్రాంతం | అస్సామ్ |

సేకర్త:- ‘ ఉదయగిరి’

## అర్చకులకు అనుకూలంగా సుప్రీంకోర్టు తీర్పు

ఆంధ్రప్రదేశ్ అర్చక కాంగ్రెస్, తెలంగాణా అర్చక సమాఖ్య మొద లగు సంస్థలు దాఖలు చేసిన కేసులపై సుప్రీంకోర్టులో ఈ సంవత్సరము ఏప్రెల్ 25 వ తేదీన న్యాయమూర్తులు శ్రీ కె. రామస్వామి, శ్రీ పి వాధ్వా హాలు గల బెంచి విచారించి ఈ నేల 9వ తేదీన తీర్పు నిచ్చారు.

5 (అయిదు) లక్షల రూ॥లు లోపు ఆదాయం కలిగిన ఆలయములకు సంబంధించి అర్చకుల అధీనములోగల భూములను గతములో వలె యధాతథముగా అర్చకులే అనుభవించు లాగున సుప్రీంకోర్టువారు తీర్పు యిచ్చారని ఆంధ్రప్రదేశ్ అర్చక కాంగ్రెస్ ఆర్గనైజింగ్ సెక్రెటరీ శ్రీ టి. రామాచార్యులు తెలియజేసినారు.

ఆంధ్రప్రదేశ్ అర్చక కాంగ్రెస్, తెలంగాణా అర్చక సమాఖ్యల తరుపున ప్రముఖ న్యాయవాదులు శ్రీయుతులు గౌరీశంకర్, శ్రీ ఎస్. మార్కండేయులు, శ్రీ ఎ. సుబ్బారావు పాల్గొనిరి.

అర్చకుల అధీనంలో భూములు లేకుండా వేతనములు లభించు విధానములను గురించి వివరములను తదుపరి తెలియజేయగలమని కూడా శ్రీ రామాచార్యులు పేర్కొన్నారు.

టి. రామాచార్యులు అర్గనైజింగ్ సెక్రటరి
ఆంధ్రప్రదేశ్ అర్చక కాంగ్రెస్, తెనాలి.

---

# దేవుళ్ళెందరు?

''ఎందఱు దేవుండ్లకని యెన్ని దేవాలయములు కట్టగలరు? ఇంత కంటె మీరు సర్వగతుడైన భగవంతునికి నామము నెచ్చట వుంటే, నచ్చట స్మరించుకొనవచ్చునుగదా? పూర్వులు నిర్మించిన సుప్రసిద్ధక్షేత్రములందలి యాలయములను నందలి దైవములను కష్టపడి దర్శించుట చేత నెక్కువ సుకృతము లభించును. పూర్వపు ఋషితుల్యులు గొప్ప మంత్రశక్తి తోడను, భక్తి ప్రపత్తుల తోడను, భగవత్కళను నాదివ్య విగ్రహములందు ప్రతిష్ఠించిన కారణము చేతను, తదాదిగనెందరో మహాభక్తులా దైవముల దర్శించుట చేతను, నాక్షేత్రములకట్టి మహత్త్వము సిద్ధించియున్నది. కావున తీర్థయాత్రలును, క్షేత్రసందర్శనములును హైందవుల కనాదిగ యాచరణీయములై పతిత పావనములై విలసిల్లుచున్నవి. గనుక మీరును తీర్థయాత్రల చులకన చేయకుడు. విదేశీయుల పాలన నుండి విముక్తి గాంచి స్వరాజ్యమును పొందితిరే గాని, స్వారాజ్యములేని స్వరాజ్యము అన్ని కష్టములను తెచ్చిపెట్టును. ప్రస్తుతము మీకులభించినది పై చిప్పయేగాని, లోని కొబ్బరికాదు. నిజమైన స్వాతంత్ర్య సుఖము లభించలేదు.''

– భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా.

# ఆదిత్య హృదయం

(గత సంచిక తరువాయి) - అల్లూరి వేంకట నరసింహరాజు

సూర్యుని ఏడు వర్ణాలను, క్రమంగా సేవించే పద్ధతిని 'క్రోమోపతి' అంటారు. శరీరంలో ఏ వర్ణం లోపించిందో, దానికి సంబంధించిన వ్యాధులే దాపురిస్తాయి. ఎఱుపు రంగు లోపిస్తే, బద్ధకం పెరుగుతుంది. కళ్లు, వ్రేలిగోళ్లు పురీషనాళము మున్నగువాటికి రక్త ప్రసరణ తగ్గుతుంది. వాత జ్వరము, మందాగ్ని, మూలవ్యాధి, రొంప, దగ్గు, నంజు వ్యాధి మున్నగునవి కలుగుతాయి. నారింజ రంగు లోపిస్తే, దంత క్షయము, తలనొప్పి, అతి మూత్రము, నడుము నొప్పి వస్తాయి. పసుపు రంగులోపిస్తే అజీర్ణ రోగము, కుష్ఠువ్యాధి సంక్రమిస్తాయి. ఆకు పచ్చ రంగు తగ్గితే సుఖ వ్యాధులు, చిడుము, గజ్జి, మశూచి వంటి వ్యాధులు సోకుతాయి. నీలి వర్ణం, తగ్గితే గుండె జబ్బు. జీర్ణాశయవ్యాధులు కలుగుతాయి. నీల వర్ణం లోపిస్తే కళ్ళు కలక, చెవిపోటు గుండెల్లో మంట శుక్ల నష్టము వంటి వ్యాధులు వస్తాయి. ఊదా రంగులోపిస్తే, న్యుమోనియో, పొడి దగ్గు పిచ్చి మొదలగు రోగాలు కలుగుతాయి.

'ధన్వంతరి' అనే నామం సూర్యునికుంది. రోగాన్ని సరిగా గుర్తించే వైద్యుడు, కల్తీలేని మందు, రోగి చేసే పథ్యము మున్నగు విషయాలపై చికిత్స ఆధారపడియున్నట్లే ఉపాసకుని ఏకాగ్రత, స్పష్ట మంత్రోచ్చారణ విశ్వాసము మున్నగు విషయాలపై మంత్ర ఫలితాలు ఆధారపడి యుంటాయి.

ఏ వర్ణం లోపంవల్ల మన శరీరంలో రుగ్మత కలిగిందో గ్రహించి, ఆ రంగు సీసాలో స్వచ్ఛమైన జలం పోసి, సూర్యకిరణాలు ఆసీసా ద్వారా ప్రసరించేటట్లు చూచి ఆ జలాన్ని ఔషధంగా సేవిస్తే వ్యాధులు నివారణ అవుతాయని అనుభవజ్ఞులైన వైద్యులు చెప్పారు.

విభిన్నమైన వర్ణాలు గల సీసాలలో, శుభ్రమైన జలాన్ని రెండంగుళాలు తక్కువగా పోసి, అదే రంగు బిరడాలతో మూతులు బిగించి, ఉదయం తొమ్మిది గంటల నుండి సాయంకాలం ఐదు గంటల వరకు ఎండలో ఉంచాలి. మధ్యలో వాటిపైన ఏవిధమైన నీడా సోక కుండా జాగ్రత్త పడాలి. పొరపాటున సూర్యాస్తమయం వరకు ఉంచివేయడం జరిగితే, దానిపై చంద్రకాంతి గాని నక్షత్ర కాంతిగాని పడితే ఆ జలం ఔషధంగా పనికిరాదు. అందువల్ల ఆ నీటిని పారబోసి సీసాను శుభ్రంగా కడిగి మళ్ళీజలం పట్టాలి. వేరు వేరు రంగుల సీసాలను ఒకేసారి ఎండలో పెట్టినా, ఒకే బీరువాలో జాగ్రత్త పెట్టినా, అవి ఒకదాని కొకటి తగలకుండా చూడాలి. ఒక దాని నీడ మరియొక దానిపై పడకుండా జాగ్రత్త పడాలి. ఏ రంగు సీసాకు ఆ రంగు కాగితమే చుట్టి భద్ర పరచాలి. (సశేషం)

---

## (విదేశీవార్తలు :) బ్రిటీష్ మ్యూజియంలో 'సరస్వతి' విగ్రహం

భారతదేశ చరిత్రలో 'భోజుడు' ప్రసిద్ధికెక్కిన రాజు. నేటి మధ్యప్రదేశ్‌లో 'ధార్' నగరం భోజరాజురాజధాని. భోజరాజు 'సరస్వతీ దేవి' భక్తుడై ధార్‌లో అందమైన సరస్వతీదేవాలయం నిర్మించాడు.

బ్రిటీష్ పాలనా కాలంలో సరస్వతీ విగ్రహాన్ని బ్రిటీష్‌వారు రహస్యంగా లండన్‌కు తరలించుకొని వెళ్ళారు. భోజరాజుకు చెందినది అని తెలుపుతూ ఆ విగ్రహం అంబికది అన్నారు.

ధార్ నగర హిందువులు సరస్వతి విగ్రహం లండన్ నుండి తరలించుకొని వచ్చుటకు ఆందోళన ప్రారంభించారు. వి.హి.ప. ప్రధాన మంత్రి శ్రీగిరిరాజకిశోర్‌జీ మ్యూజియం వారిని విగ్రహం తిరిగి ఇవ్వమని కోరారు. ముస్లిం, బ్రిటీష్ కాలంలో ఆలయం దుస్థితికి గురికాగా ధార్ నగరంలో సరస్వతి దేవాలయం పునరుద్ధరణకు అచటి హిందువులు ఆందోళన జరుపుతున్నారు. (మీ.ఫో).

# మతం మారుతావా, మరణిస్తావా!

బందాబైరాగి ఆనాడు పరిస్థితులు ఇచ్చిన పిలుపును గణించకుండా ఏకాంత సాధనలో నిమగ్నుడై ఉన్నాడు. ఆ రోజుల్లోనే గురుగోవింద సింహుడిని ఆయన కలుసుకోవడం జరిగింది. అన్యమతస్థులు మన సమాజంపై చేస్తున్న అత్యాచారాలు వివరిస్తూ గురుదేవుడు ఇలా చెప్పాడు - ' ఆత్మీయుడా! మన దేశం, ధర్మం, సంస్కృతి మంటగలిసిపోతున్నాయి. మనం పరతంత్ర జీవనాన్ని గడుపుతున్నాం. ఇట్టి సమయంలో భజనలు, పూజలు, జపధ్యానాదులు ఎందుకోసం?'

గురుగోవిందసింహుని తర్కశుద్ధమైన మాటలు విని బందాబైరాగి ఆయన అనుయాయి అయినాడు. గురుదేవుని వలెనే ఆయన కూడా దేశ స్వాతంత్ర్యం కోసం ఆజన్మాంతం పనిచేసేందుకు ప్రతిజ్ఞ చేశాడు. ఈ ఉద్దేశ్యంతోటే బందా జీవితమంతా ప్రయత్నశీలుడై ఉన్నాడు. ముస్లింలతో పోరాడుతూ పోరాడుతూ చివరకు ఆయన పట్టుబడ్డాడు. ఆయనను అడిగారు - 'మరణిస్తావా లేక మతం మారుతావా?' బందా బైరాగి తన మతాన్ని వదలి పెట్టను అని ఖచ్చితంగా చెప్పేశాడు. ఆ తరువాత నిప్పుల్లో కాల్చిన ఎర్రటి ఇనుప చువ్వలతో బందా శరీరంలోని ప్రతి మాంసపు కండను పైకి పెల్లగించారు. కాని బందా బైరాగి కించిత్ ఐనా చలించలేదు. 'అయ్యో' అని కూడా అనలేదు. దేశధర్మముల బలివేదికపైన నవ్వుతూ నవ్వుతూ తన ప్రాణాలను అర్పించాడు. బందా బైరాగి అమరుడైనాడు. అఖండ కీర్తిని సంపాదించాడు.

---

# మానవసేవ పేరుతో...

నలభై ఏళ్ళ క్రితం, మదర్ థెరిసా అనే పేరుగల ఒక రోమన్ కాథలిక్ చర్చ్‌కి చెందిన ఒక విదేశీ ఏజెంట్ కలకత్తా వచ్చింది. వాటికన్ సిటీ నుండి వచ్చే ఆదేశానికి, అమెరికా నుండి వచ్చే ధన సహాయంతో అమలు చేయడమే ఆమె పని. ''మిషనరీస్ ఆఫ్ చారిటీస్'' అనే పేరుతో మన భారత జాతిని మొదట సాంస్కృతికంగా తర్వాత రాజకీయంగా నాశనం చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. అమెరికా నుండి ఈ స్వచ్ఛంద సంస్థకు డబ్బు ఎందుకు చేరుతుంది? "Fera" యొక్క నియమాల ప్రకారంగా విదేశీల నుండి వచ్చే విదేశీ డబ్బు చెందడానికి ప్రభుత్వం నుండి అనుమతి తీసుకోవలసి వస్తుంది. కానీ, ''మిషనరీస్ ఆఫ్ చారిటీ'' అనే సంస్థకు ఈ నియమం ఎందుకు వర్తించదు?

ఇది ఒక అంతర్జాతీయ కుట్ర దీనిలో అమెరికా మరియు వాటికన్‌లోని రోమన్ కాథలిక్ చర్చ్ ప్రముఖ పాత్రలు వహిస్తున్నారు. పాశ్చాత్య సామ్రాజ్యవాదుల సైన్యము చతురంగసేన, ఇలావుంటుంది. ఆర్మీ, నేవీ, ఎయిర్‌ఫోర్స్, మరియు చర్చ్. చర్చ్ ఆధారంగా వీళ్ళు రాజకీయంలో వాళ్ళ స్థానాన్ని స్థిర పరచుకుంటారు.

హిందువులలో ఉన్న అశ్రద్ధ, అనైక్యత, మరియు ఆత్మగ్లాని వలన వీరిని మతమార్పిడి చేయడం అనేది చాలా సులభం. ఈ విషయాన్ని చక్కగా అర్థం చేసుకుని ఇప్పటివరకు లక్షలాది హిందువులను క్రైస్తవులుగా మార్చారు. ఇదే వారి ''మానవ సేవ''.

అమెరికా వారికి తను చేసిన సేవను దృష్టిలో పెట్టుకొని ఆ ప్రభుత్వం భారత దేశంలోని నాయకుల పై ఒత్తిడి చేసి ''భారతరత్న'' మరియు ''బిరసా ముండా అవార్డు'' ను ఇప్పించారు, థెరీసాకు.

మదర్ థెరీసా చేసే 'మానవసేవ' హిందువులకే పరిమితమై ఉన్నది. కానీ ముస్లిములు ఎంత బీద వారైనా మత మార్పిడికి గురికారు. అందువలన వాళ్ళకు సేవ చెయ్యరు.

శ్రీమతి సోనియా గాంధీ (కేథలిక్ క్రిస్టియన్ ఈమె నిజం పేరు ఎవరికి తెలియదు.) మదర్ థెరిస్సాతో కలిసి మొత్తం భారతజాతిని క్రైస్తవంగా మార్చడానికి కంకణ బద్ధులై ఉన్నట్లున్నారు.

పాకిస్తాన్ మరియు బాంగ్లాదేశ్ లాంటి ముస్లిమ్ దేశాలలో మతమార్పిడిని నేరం క్రింద భావిస్తారు. ఏరోజు మన భారతదేశంలో అలాంటి చట్టం వస్తుందో, ఆరోజు నుంచి మనకు మంచి రోజులు వస్తాయి.

హింది (రైటర్స్ ఫోరమ్ ద్వారా ఒక పుస్తకము వ్రాయడము జరిగింది, దాని పేరు (Vatican-Teresa-Sonia), వాటికన్-థెరిస్సా-సోనియా. ఈ పుస్తకాల్లో హిందువులను ఎలామోసము చేస్తున్నారో వ్రాయబడి ఉన్నది.

మానవ సేవ పేరుతో మన జాతిని సర్వనాశనం చేసే జాతిద్రోహులలో మదర్ థెరిస్సా మొదటి స్థానంలో, మన చరిత్రలో వ్రాయబడును దీనిలో ఏమి అనుమానము లేదు.

ప్రమోద్ వళసంగకర్, దిల్‌సుఖ్‌నగర్.

# శ్రీ రుద్రమ్

– డా. M.V.R. శర్మ

"నమస్పస్పింజరాయ త్విషీమతే పథీనాం పతయేనమః" సస్పింజర పదమునకు ఎరుపు, పసుపులు కలిసిన లేత గరిక వంటి రంగు గల వాడని అర్థము. ఈ రంగుల అర్థమేమి? ప్రపంచములో రకరకముల మనుష్యులుందురు. ఆస్తికులు, నాస్తికులు, వేదములను విశ్వసించు వారు, నమ్మని వారు. సాత్వికులుందురు. రాజస, తామసికులును వుందురు. లేక పై లక్షణములు అవి కొంత, ఇవి కొంత కలగలసి కూడ వుందురు. ఇవి అన్నియూ కూడ పరమేశ్వరుని మాయతో జన్మించిన సంసారపు లక్షణములే. ఈశ్వరుడు ఇట్టి వివిధ వర్ణములు, గుణములు గలవారిని భిన్న, భిన్నముగా సృజించుట ఎందులకు? నిజమునకు ఈశ్వరునకు పక్షపాత బుద్ధి లేదు. జీవులే తమ, తమ పుణ్య, పాప కర్మల కనుగుణముగా జన్మల నెత్తుచున్నారు. ఆ జన్మలలో ఆ యా పుణ్య పాప ఫలములు ననుభవించుచున్నారు. ఒక జన్మము ఆ ఫల భోగమునకు సరిపోనిచో మరొక జన్మమును లేద జన్మ పరంపరను పొందుచున్నారు. భగవంతుడు కర్మ ఫల ప్రదాత గా వుంటూ కూడా పాపులపైన జాలి పడుతున్నాడు. కరుణా మయుడు గనుక దయను పాపులపై ప్రసరిస్తున్నాడు. నాస్తికులపై, పాపులపై, ధర్మ విముఖులపై, అవైదికులపై – వీరందరిపై కూడ ఆ పర లోకమున నున్న తండ్రికి దయమే. వీరందరూ వైర భక్తులే. మొత్తము మీద భక్తులే గదా? రావణాసురునికి ప్రభువు మోక్ష మొసగ లేదా?

దురదృష్ట వశాన్నో, పాపకర్మల తోనో కొందరికి సనాతన ధర్మం పైన అభిరుచి వుండదు. నిజానికి వీరి సంఖ్య యే అధికము వీరికి ఏ మార్గము లేక పోతే స్వేచ్ఛాచార పరాయణులై వీరు నష్ట పోతారు, సమాజాన్ని నష్ట పరుస్తారు. ఈ నాస్తికాదులను మోహ పరిచి, ఆకర్షించేందుకా అన్నట్లు వేద నింద కూడా సమ్మిళిత మైన కొన్ని "మతాలను" కూడా ఆ తండ్రి యే ఏర్పరిచినాడు. అవి యే తాంత్రికము, చార్వాకము, ఇస్లాము, క్రైస్తవము మొదలైనవి. ఏదో నొక వరవడి లో నీతిగా చరించి, భూత దయతో ప్రవర్తించి, సజ్జన సాంగత్యంలో చిరకాలానికి అయినా జన్మ, జన్మాంతరాల కయినా సరే సనాతన ధర్మం లో మునకలు వేసి కడకు ముక్తిని పొందే సౌభాగ్యం ప్రసాదిస్తున్నాడు ఆ ప్రభువు. కనుక ఈ యీ మతాలన్నీ కూడా మోక్ష మార్గాన్ని, రాజ మార్గాన్ని చేరుకునే పిల్ల తోవలే. దైవానికి పాపులపైనా, దుర్మార్గుల పైనా కూడా అమిత కరుణయే.

త్విష్ అనే పదానికి కాంతి అని అర్థము. ప్రకాశత్వము దైవ లక్షణము. పరమాత్మ తన కాంతిని ప్రసరిస్తున్నాడు. సన్మార్గులపైన కాంతిని వెదజల్లి మార్గదర్శనం గావిస్తున్నాడు. పథమనగా మార్గము. మోక్ష మార్గము. ఆ మార్గములన్నిటికీ అధిపతీ, గమ్యుడూ రుద్రుడే.

భగవదుపాసకులలో ఎన్నెన్నో ఉపాసనా పద్ధతులు, వారి యోగ్యతలు కూడా సహజంగానే వేరు వేరు స్థాయిల్లో వుంటాయి. ఆ తర, తమ బేధాన్ని బట్టీ వాళ్ళ అర్హతలను బట్టి దేవయానం, పితృయానం ఆదిగాగల వివిధ మార్గాల్లో పరమాత్మ మనసందరినీ చేదుకుంటున్నాడు. అలాంటి వివిధ మార్గ ప్రవర్తకుడు "పతీశాం పతి".

త్రయియా, సాంఖ్యం, యోగం, పశుపతి మతం వైష్ణవమితి ప్రభిన్నే ప్రస్థానే వరమిద మిదం పథ్యమితిచ.

రుచీణాం వైచిత్ర్యాత్ రుజ కుటిల నాపథ జుషాం

రుణాం ఏకోగమ్యః త్వమసి పయసా మర్ణవ ఇవ

నీళ్ళన్నిటికీ గమ్యం సముద్రుడైనట్లుగానే ఉపాసనా పద్ధతులన్నిటికీ లక్ష్యం పరమాత్మయేకదా! అట్టి రుద్రునకు నమస్కారము.



ఆశ్లీలతపై ముట్టడికి - మహిళామణులు, కర్నూలు.




అశ్లీలతపె దాడికి - మహిళామణులు - అనంతపురం.